# శ్రీవాణి 7వ జన్మదిన ప్రత్యేక సంచిక

## జనవరి 1991 (2వ వారంలో) వెలువడుతుంది

* ప్రముఖుల సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక వ్యాసములు, కవితలు, కథలు మరెన్నో విజ్ఞాన విశేషాలతో 125 పేజీలతో వెలువడుతుంది "ప్రత్యేక సంచిక".

* భగవాన్ బాబా 65 వ జన్మదినోత్సవ వేడుకలు, స్వర్ణోత్సవ విశేషాలు, ప్రముఖుల ప్రసంగాలు, కలర్ ఫొటోలు, బాబావారి దివ్యమహిమలు, ఇంకా ఎన్నో...ఎన్నో విశేషాలతో వెలువడుతుంది "ప్రత్యేక సంచిక"

## ప్రత్యేక సంచిక వెల రు. 10-00

* భగవాన్ బాబా జన్మదినోత్సవ సందర్భమున నవంబర్ '90 'శ్రీవాణి' తో పాటు 40 పేజీలు గల "శ్రీ సాయివాణి" పుస్తకం కూడా ఉచితంగా పంపబడుతుంది.

* క్రొత్తగా చేరే చందాదారులకు "కనీస విజ్ఞానం" పుస్తకం ఉచితంగా పంపబడుతుంది.

ముఖ్య గమనిక : సంవత్సర చందా రు. 42-00 లు పంపితేచాలు పై అవకాశములను పొందుటకు అధికంగా ఎవరూ పంపనవసరంలేదు.

చందాలు రెన్యూవల్ చేయవలసినవారు వెంటనే చేయండి !

క్రొత్త చందాలను వెంటనే పంపండి ! త్వరపడండి !

ఈ అవకాశమును సద్వినియోగం చేసుకోండి !

---

## పాఠకులకు మనవి

ఆర్థిక స్తోమత కలిగిన పాఠకులు జీవిత సభ్యత్వం గాని, 4 సం॥ చందా గాని పంపి "శ్రీవాణి"ని ప్రోత్సహించమని మనవి చేస్తున్నాను.

సం॥ చందా : రు. 42-00, 4 సం॥ చందా : రు. 150-00, జీవిత సభ్యత్వము రు. 600-00. జీవిత సభ్యుల ఫోటోలు శ్రీవాణి 7 వ జన్మదిన ప్రత్యేక సంచికలో ముద్రించబడుతాయి.

—మేనేజర్

అక్టోబరు 1990

సంపుటి : 6

సంచిక : 10



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52 రామానాయుడు పేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818



విడి ప్రతి : రు. 3-50

సంవత్సర చందా : రు. 42-00

4 సం॥ల చందా : రు. 150-00

జీవిత సభ్యత్వం : రు. 600-00

Cheques & Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM


# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు - కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



ముఖచిత్రం : 'పంజాబు కేసరి' లాలా లజపతిరాయ్

శ్లో॥ సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశాశాఖా స్వటతి ఝుటితి స్వైర మభితః
కపాలిన్! భిక్షో! మే హృదయకపి మత్యంతచపలం
దృఢం భక్త్యాబద్ధ్వా శివ! భవదధీనం కురు విభో

మనస్సును జయించగలిగిన మనిషి నిజంగా మహాత్ముడే అసలి. సర్వేంద్రియాలకు అధిష్ఠానమైన మనస్సు ఈ సంసారాల్ని నడిపిస్తున్నది. సంసార లంపటంలో పడి అనేక బాధలనుభవిస్తున్నాం బాబోయ్ అంటూ ప్రతివాడూ వాపోతున్నాడు. కాని సత్యాన్వేషణం చేస్తే దానికంతటికి కారణం ఈ మనస్సే అని స్పష్ట

# అమృతవాణి

## కూచిభొట్ల చంద్రశేఖర శర్మ

మవుతుంది. మనస్సును స్వాధీనం చేసుకొన్నవాణ్ణి మనమనుకొనే సంసారం ఏమీ చేయలేదు. అయితే దీన్ని వశం చేసుకోటమనేదే పెద్ద సమస్య. ఎందుకంటే యిది అతి చంచలం. ఒక్క క్షణంకూడా నిలకడగా వుండదీ మనస్సు. అందుకనే అర్జునుడంతటివాడు "చంచలం హి మనః కృష్ణ, ప్రమాధి బలవద్దృఢం" అని పరమాత్మతో మొరపెట్టుకొన్నాడు.

అలాంటి చంచలమైన మనస్సు కోతి వంటిదని ఆచార్య శంకరులీ శ్లోకంలో అభివర్ణించారు.

ఈ కోతి మామూలు అడవుల్లో కాదు తిరిగేది. మోహం అనే అరణ్యంలో తిరుగుతుంది. మోహం చాలా చెడ్డది కదా! ఇది అరిషడ్వర్గంలో ఒకటి. ఈ మోహంవల్లనే "ఇది నాది" అనే మమకార మేర్పడి మనిషి గుడ్డివాడై పోతాడు. ఇది తమోగుణం. దీనివల్ల బుద్ధి నశిస్తుంది.

అటువంటి మోహాటవిలో కామాంధతతో యువతుల వక్షస్థలమనే పర్వతాలపైన ఈ మనస్సనే కోతి సంచరిస్తూంటుంది. అంటే దీనికీ స్త్రీ లౌల్యం చాలా యెక్కువ. మనిషిలో వుండే ఆశలే ఈ అడవిలో చిక్కిరి బిక్కిరిగా పెనవేసుకొన్న పెద్ద పెద్ద చెట్ల కొమ్మలు. ఈ కోతి ఎప్పుడూ ఈ కొమ్మలమీదనే దుముకుతూ వుంటుంది. దాని యిష్టం వచ్చినట్లుగా అంతట తిరుగుతుంది. దీన్ని ఆపగలిగినవాడు అదుపులో పెట్టగలవాడు లేడు. ఆశలతో అల్లుకొన్నదీ అరణ్యం.

ఈ మనస్సనే కోతిని స్వాధీనం చేసుకోలేకపోతే సంసారంలో బాధలు తప్పవీ మనిషికి. దీన్ని స్వాధీనం చేసుకోవాలంటే నిర్మలమైన భక్తి వుండాలి. మామూలు కోతిని మంచి గొలుసుతో కట్టేస్తే అది చెప్పినట్లు పడి వుంటుంది. కాని యీ మనస్సనే కోతిని కట్టివేయాలంటే భక్తి తప్ప మరొకటి లేదు.

అందువల్ల ఓ పరమశివా! ఈ చంచలమైన యీ నా హృదయమనే కోతిని గట్టిగా భక్తితో కట్టివేసి నీ అధీనం చేసుకో స్వామి! అని ఆచార్యస్వామి భక్తుల పక్షంలో ప్రార్థించారు.

కపాలం చేతిలో పట్టుకొని తిరిగే భిక్షుకుడు ఒక కోతిని కూడా వెంటేసుకొని తిరుగుతాడు. ఆ కోతి అతను చెప్పినట్లు వింటుంది. ఈ భిక్షుకుడు సామాన్యుడు కాదు పరమశివుడు. కనుకనే భక్తుల మనస్సనే కోతిని తనవెంట తిప్పుకొంటూ తిరుగుతాడు. ఇందులో పరమార్థ మేమిటంటే—

సర్వదా చంచలంగా తిరుగుతూండే మన మనస్సును నిండైన భక్తిభావంతో భగవంతుని కర్పించాలి. ఆయన మహిమలను కీర్తిస్తూ ఆయన తత్వాన్ని ధ్యానించాలి. అప్పుడు ఈ మనస్సు నిలకడగా భగవంతునియందు నిలుస్తుంది అని భావం. ○

# దీపావళి

జయప్రద

"మనసు నాధారముగా గొన్న మానవుండు
పశువుకంటెను హీనమై పతనమౌను
బుద్ధి నాధారముగా గొన్న బుధజనుండు
పశుపతిగ మారునని పల్కె పర్తి విభుడు॥

మనమందరము మానవులుగానే పుట్టాము. పుట్టిన ప్రతి జీవి గిట్టుట లోకధర్మం. అయితే, మనిషి పోయినా, ఆ వ్యక్తి చేసిన రెండు కార్యములుమాత్రము శాశ్వతంగా నిలచిపోతాయి. ఒకటి మంచి, రెండు చెడు.

ఈనాడు రాముడు, రావణుడు ఇద్దరూ లేరు. అయినా రాముని గౌరవించి పూజించుతున్నాము. రావణుని నిందించుతున్నాము. ఈ రెండింటికీ, వ్యత్యాసం వారియొక్క గుణగణాలు, వారి ప్రవర్తన.

వ్యక్తియొక్క ప్రవృత్తి ప్రవర్తననుబట్టే వాడు మానవుడా? దానవుడా? అన్న ప్రశ్న వస్తుంది. సద్వంశమునందు పుట్టినను అసుర గుణములు గలిగియున్నచో వాడు దానవుడే అగును. అందుకు ఉదాహరణయే నరకాసురుని కథ. నీచ కులమందు జన్మించినను సత్ప్రవర్తన గలిగినవాడు మంచి వ్యక్తిగా రాణించును.

నరకుడు మానవుడేగానీ రాక్షస కృత్యములను చేయుటచేత అతనికి "అసురుడు" అనే నామము నిలిచిపోయింది. అసురత్వముచేత, నరకమునకు గొనిపోయేవాడు గనుక, ఇతనికి "నరకాసురుడు" అని పేరు వచ్చింది. "యథా రాజా తథా ప్రజా" అన్నట్లు అతని యొక్క సేవకులు కూడా అతని మార్గాన్నే అనుసరించేవారు. దానివల్ల ప్రజలు చాలా బాధలకు గురైనారు. నరకాసురుని రాజ్యానికి ముఖ్య పట్టణము "ప్రాగ్జ్యోతిష పురము" అని పేరు. "ప్రాగ్" అనగా ముందు "జ్యోతి" అనగా దీపము, వెలుతురు, "పుర" అనగా గ్రామము. అటువంటి ఆత్మజ్యోతిని మరచినటువంటి వాడు నరకుడు. ఆత్మజ్యోతిని మరచి అసుర భావనలు కలిగినవారెవరైనా నరకాసురులే.

అటువంటి నరకాసురుని వధించిన దినమే ఈ నరకచతుర్దశి. అదీ కాక దీనికి మరియొక ముఖ్యమైన పేరు దీపావళి. దీపావళి అంటే దీపముల తోరణము. దీపహారము అని అర్థము. ఈ పండుగను ఎందుకు ఈ విధంగా చేస్తున్నారు అంటే, సత్యభామా సహితుడైన శ్రీకృష్ణుడు నరకాసురుని హతమార్చిన రోజే ఈ దినము. నరకుడు భూదేవి పుత్రుడు. ఓర్పుకు, సహనానికి భూదేవి పెట్టింది పేరు. అయినా ఆమె గర్భాన పుట్టిన నరకుడు దుష్టుడై, దుర్మార్గుడైనాడు. కన్నతల్లి అయినా, దుష్టుడైన పుత్రుణ్ణి భరించలేదు అనటానికి నరకుని కథే మనకు నిదర్శనం. అతని దుష్ట పరిపాలనను నేను భరించలేనని భూదేవి మొర పెట్టుకొనగా భగవంతుడు ఈ దినమున అతనిని సంహరించాడు. అయినా కన్నతల్లి కనుక, నరకుని వధించిన రోజున ప్రజలెల్లరు దీపములు పెట్టుకొని ఆ రోజు పండుగ జరుపుకోవలెనని ఆమె ప్రార్థించగా శ్రీకృష్ణుడు అలాగేనని వరమిచ్చాడు. అందువల్ల దుష్టశిక్షణ శిష్టరక్షణ జరిగిన దినముగా అందరూ ఆనందముగా ఆ రోజు తలస్నానం చేసి, క్రొత్త బట్టలు ధరించి, సాయంకాలం దీపములతో తమ గృహాలను అలంకరించుకొని, బాణాసంచాను కాలుస్తూ తమయొక్క సంతోషాన్ని వ్యక్తం చేస్తుంటారు. ఆ దీపాల వెలుగులోని అర్థం, మనిషిలోని అసుర

(తరువాయి 44వ పేజీలో)

# భగవాన్ సాయి దివ్య లీలలు

ఈ మధ్య 'కువైట్' లో జరిగిన విధ్వంసకాండ యావత్ ప్రపంచానికి తెలిసినదే. అక్కడ మన తెలుగువారెందరో ఉద్యోగరీత్యా వెళ్ళినవారున్నారు. వారిలో డా॥ గొరిజాల విజయసింహులు కుటుంబం ఎంతో కాలం నుండి అక్కడ వుంటున్నది. శ్రీమతి గొరిజాల ఉమ కలలో భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు పీతాంబరాలు ధరించి దర్శనమిచ్చి "నీవు నీ కుటుంబంతో నీ స్వదేశమైన భారతదేశానికి వెంటనే వెళ్ళు" అని చెప్పగా స్వామి మీద వుండే నమ్మకంతో తన కుటుంబ సభ్యులతో (శ్రీమతి ఉమ మరియు కుమారులు కిరణ్, ప్రవీణ్‌లు) భారతదేశం వచ్చింది ఆమె. వారు ది 24-8-90 న బయలుదేరి విమానంలో 26 వ తేదీకి మద్రాసు చేరుకున్నారు. కువైట్‌లో ఆ రోజుననే విధ్వంసకాండలు జరిగి ఎంతో మంది ప్రవాసాంధ్రులు అనేక యిక్కట్లకు గురియైనారు. "స్వామిని నమ్ముకున్నవారిని కాపాడటం వారి అవతార ప్రత్యేకత" అని శ్రీమతి ఉమగారు "శ్రీవాణి" కి ప్రత్యేకంగా ది 2-9-90 న ఒక లేఖ వ్రాసారు. స్వామి మహిమాన్వితశక్తికి ఈ సంఘటన ఒక చిన్ని ఉదాహరణము మాత్రమే.

జిల్లా నందిగామలో శ్రీ కె. వి. రామశేషు (మొబైల్‌గైడ్, కె.డి.సి.సి. బ్యాంక్) గారు ఉద్యోగ రీత్యా వచ్చి వున్నారు. వారిది తూ. గో. జిల్లా. వారి తల్లిదండ్రులు స్వామి భక్తులు కావటంవలన ఈ సంవత్సరం ఫిబ్రవరిలో పుట్టపర్తి వెళ్ళి స్వామిని దర్శించివచ్చారు. మార్చిలో నందిగామలో గీతా మందిరంలో జరిగిన జ్యోతి ప్రారంభోత్సవ సభలో స్వామి అనుగ్రహంతో ప్రసంగించే మహద్భాగ్యం నాకు కలిగింది. ఆ సమావేశానికి రామశేషు దంపతులు కూడా వచ్చారు. మరల ఏప్రియల్‌లో నా సోదరుడు కొమరగిరి రామమోహనరావు స్వగృహంలో ఏర్పాటు చేసిన జ్యోతి కార్యక్రమంలో పాల్గొని ఉపన్యసించే సదవకాశం మరల నాకు లభించింది. అప్పుడు రామశేషు గారు శ్రీవాణిని పంపమని కోరగా స్వామి చిన్ననాటి చరిత్ర ముద్రించిన శ్రీవాణీలుకూడా పంపటం జరిగింది. రామశేషుగారికి సంతానం లేదు. దర్గాకు (ముస్లిముల ఆరాధనా మందిరం) వెళ్ళి విభూతిగాని, తాయత్తుగాని తెచ్చుకుంటే మీ కోరిక సఫలీకృతమవుతుందని మిత్రులు ఆయనకు చెప్పారు. కానీ వెళ్ళలేదు. ఈ లోపు నేను పంపిన శ్రీవాణి పత్రికలు వారికి అందినాయి. అందులో ఒక పత్రిక చదువుదామని తీయగా దానినుండి ఒక బంగారపు చిన్ని మంగళసూత్రం క్రింద పడింది. ఆయన ఆశ్చర్యానికి అంతులేకపోయింది, భార్యకు చూపించాడు. దానిని మహాప్రసాదంగా భావించి బాబా ఫొటో ముందుపెట్టి స్వామిని మనసారా ఆరాధించారు. ఆమె మరల మరనాడు అదే శ్రీవాణిని చదవటానికి తీసింది. మరల మరొక మంగళసూత్రం శ్రీవాణి నుండి పడింది. భర్త ఇంటికి వచ్చిన తరువాత చూపించింది. ఆ రెండు మంగళసూత్రాలను తీసుకొని వెళ్ళి సమితిలో అందరికి చూపించారు. నందిగామ సమితి కన్వీనర్ శ్రీ పబ్బతి సత్యంగారి సూచనపై ఆ రెండు మంగళసూత్రాలు ఆమె మెడలో ధరించింది. ది 21-9-90 న నందిగామ వెళ్ళి శ్రీవాణి ద్వారా ప్రసాదించబడిన ఆ రెండు మంగళసూత్రాలను చూచి వచ్చాను. ఆ రెండు మంగళసూత్రాలపైన మసీదు బొమ్మలు ముద్రించబడి వున్నాయి. స్వామి అద్భుత లీలకు అది ఒక నిదర్శనం. అంతేకాదు స్వామి

(తరువాయి 41 వ పేజీలో)



# ‘పంజాబు కేస  లాలా లజప  యి



"త్యాగే నైకే అమృతత్వ మానశుః"
త్యాగం వలన మాత్రమే మానవులు అమరత్వమును, అమృతత్వమును పొందగలరని ఉపనిషత్తులు తెలియ జేయుచున్నవి. భారత జాతీయ స్వాతంత్ర్య సమరాంగణంలో, అహింసాయుత పద్ధతులతో క్రూర, కర్కశ కుటిల, దమన రాజనీతి ననుసరించిన బ్రిటీష్ ప్రభుత్వమును ఎదిరించి తమ సర్వస్వమును త్యాగంచేసిన అమర వీరులెందరో కలరు. అట్టి త్యాగశీలురులలో నీతి, నిజాయితీ, నిస్వార్థపరత్వం, జాతీయ, అంతర్జాతీయ అవగాహన సేవాతత్పరత, దీనజనోద్ధరణ మొదలగు ఆదర్శభావములు గలవారిలో లాలా లజపతి రాయ్ ప్రముఖులు.

అది 1928వ సంవత్సరం అక్టోబర్ 30వ తేది. సైమన్ కమీషన్ బహిష్కరణ సందర్భమున లాహోర్‌లో జరిగిన బ్రహ్మాండమైన నిరసన ప్రదర్శనకు లాలా లజపతిరాయ్ ఆధ్వర్యం వహించారు. ఈ ప్రదర్శన చాలా ప్రశాంతముగా నిర్వహించబడినప్పటికీ క్రూరత్వమునకు పాల్పడి లాఠీచార్జీ అమానుషంగా చేసినారు. ఆంగ్లేయుల పాశవిక చర్యకు లాలాజీ గురియైనారు. పలు లాఠీ దెబ్బలు పడినప్పటికీ ఒక అంగుళం కూడా వెనక్కు వేయలేదు లాలాజీ. "నీవు నిజంగా మగవాడవైతే నీ పేరు చెప్పు" అని లాఠీచార్జీ జరిపిన పోలీసు అధికారిపై సింహంలా గర్జించాడు లాలాజీ. ఉద్రేకపరులైన ప్రదర్శకులను ఓదార్చి ప్రతీకారం చేయరాదని వారిని వారించారు. ప్రజలు స్తబ్ధులై ఎక్కడివారక్కడ నిలబడిపోయారు. ఆనాడు సాయంత్రం జరిగిన పెద్ద బహిరంగసభలో "నన్ను కొట్టిన ఒక్కొక్క దెబ్బ బ్రిటీష్ సామ్రాజ్య శవపేటికను ఒక్కొక్క మేకు అవుతుంది" అని గర్జించినాడు. (Every blow on the bodies this afternoon is like a nail driven into the coffin of british imperialism) తీవ్రమైన లాఠీ దెబ్బల వలన క్షతగాత్రుడైన లాలాజీ ఆరోగ్యం త్వరితగతిన క్షీణించసాగింది. నవంబర్ 17, 1928 సం॥న లాలాజీ మృత్యుదేవత ఒడిలోనికి ఒరిగిపోయినారు. లక్షలాది భారత ప్రజలు అశ్రుధారలు కురిపించినారు. లాలాజీ మరణవార్త విన్న గాంధీజీ

కె. పి. నాయుడు

నిర్వీర్యులై "లాలాజీ వీరుడు. వీరమరణం పొందినాడు. సూర్య చంద్రులున్నంతవరకు లాలాజీ వంటి మహాత్ములకు మరణం లేదు. ఆయన మృతజీవి. లాలాజీ ఒక వ్యక్తికాదు, ఒక మహాసంస్థ. (So long as the sun shines in the Indian sky persons like Lalaji will not die)

నిష్కలంక దేశభక్తుడు, నిస్వార్థపరుడు, విద్యావేత్త సంఘ సంస్కర్త, ప్రముఖ పత్రికా సంపాదకుడు అయిన లాలా లజపతిరాయ్ జీవితచరిత్ర నేటి యువతరానికి ప్రేరణ కాగలదని, అట్టి మహనీయుల చరిత్రలు మనకు ఆదర్శప్రాయం కాగలదని విశ్వశిస్తున్నాను. వీరులకు జన్మభూమి అయిన పంజాబ్‌లో జన్మించి రెండున్నర దశాబ్దములు పంజాబు రాజకీయాలలో, సాంఘిక సేవా కార్యక్రమాలలో, విద్యా వ్యాప్తిలో పేరెన్నికగన్న ఏకైక నాయకుడు లాలా లజపతిరాయ్. "లాల్, బాల్, పాల్" అనే పేరుతో అవిభాద

ఏముగా భారత ప్రజల హృదయాలలో చిరస్మరణీయంగా నిలచినవారిలో మొదటివారు లజపతిరాయ్

> " గత చరిత్ర చూచుకొని గర్వపడుట తెలివితక్కువ. మన పూర్వీకులు వేసిన పునాదులపై నిలుచుటకాదు మనకు గర్వము. ఆ పునాదులకు సర్వవిధముల తగిన సుందరమైన సౌధ నిర్మాణము చేయగలిగినపుడే వారికి తగిన వారసుల మని గర్వించవలెను."
>
> \- లాలా లజపతిరాయ్

రెండవవారు బాలగంగాధర్ తిలక్, మూడవవారు బిపిన్ చంద్రపాల్.

లాలా లజపతిరాయ్ 1865వ సంవత్సరం జనవరి 5వ తేదీన ఫిరోజ్‌పూర్ జిల్లాలో ఢూడ్‌కే అను గ్రామంలో లాలా రాధాకృష్ణ, గులాబ్ దేవీలకు జన్మించినాడు. చిన్ననాటినుండి గ్రంథ పఠనము, విద్యాశక్తి మెండుగా గల లాలాజీ అన్ని తరగతులలోను ఉత్తమ విద్యార్థిగా గుర్తింపు పొందినాడు. తన స్వగ్రామంలో ప్రాథమిక విద్యను ముగించి, లాహోర్‌లో హైస్కూలు విద్య నభ్యసించి, కొంతకాలం ఢిల్లీ, లూధియానాలలో విద్య నభ్యసించి కలకత్తా విశ్వవిద్యాలయం, పంజాబు విశ్వ విద్యాలయములలో ఉన్నత విద్యను పూర్తిచేసినాడు.

లాలాజీ మొదట్లో ఉపాధ్యాయ వృత్తిని చేబడుదామని తలంచాడు. కానీ మిత్రుల సలహాతో న్యాయవాద పరీక్షలో ఉత్తీర్ణుడై 1883వ సంవత్సరంలో న్యాయవాద వృత్తిని చేబట్టి జీవనయాత్రను ప్రారంభించాడు. 1875లో దయానంద సరస్వతి ఆర్యసమాజమును స్థాపించారు. లాలాజీ ఆర్థిక, రాజకీయ, సాంఘిక, ధార్మిక, ఆధ్యాత్మిక భావాలపై స్వామి దయానంద సరస్వతి ప్రభావం ఎంతయో కలదు. లాలాజీ ఒకచోట ఉపన్యసిస్తూ " వైదిక మతమును అభిమానించటం, ప్రాచీన ఆర్య సంస్కృతిని గౌరవించటం, సత్యం, ధర్మం, స్వాతంత్ర్యం అనే చైతన్యమయినటువంటి భావాలను నాలో ప్రేరణ కలిగించింది ఆర్యసమాజమే ఒక కార్యాన్ని నిర్వహించే శక్తికూడా ఆర్యసమాజమే నాకు ప్రసాదించింది " అని గర్వంగా చెప్పుకున్నారు. సమాజ సేవ సర్వేశ్వరుని సేవగా భావించి, సమాజ వికాసమునకు, ప్రగతికి ఎన్నో కార్యక్రమాలను రూపొందించి, అమలుపరచి, ప్రజల మన్ననలను పొందుటయేగాక, వారి హృదయాలలో శాశ్వతమైన స్థానాన్ని సంపాదించారు లాలాజీ.

లాలా హంసరాజ్, పండిత గురుదత్తులు లాలాజీ బాల్యమిత్రులు. వీరి సహాయ సహకారములతో 1883 సం.లో ''Regeneration of Aryavarta'' అను ఇంగ్లీషు పత్రికను, "దేశోపకారి" అను ఉర్దూ పత్రికను ప్రారంభించారు. లాహోర్‌లో దయానంద పాఠశాలను నెలకొల్పినారు. అది తరువాత " ఆంగ్ల వైదిక కళాశాల" గా రూపుదిద్దుకున్నది. రోతక్, హిస్సార్, లాహోర్ పట్టణాలలో న్యాయవాదవృత్తిని చేబట్టి మంచి పేరుప్రఖ్యాతులను సంపాదించటమేగాక, లక్షలాది రూపాయలను ఆర్జించినారు. సంపాదించిన ధనమును స్వార్థ స్వప్రయోజనాలకు కాక, సంఘ సేవ కార్యక్రమాలకు ఉపయోగించిన త్యాగశీలి లాలాజీ. పంజాబులోను, దేశంలో యితరత్రా అనేక పాఠశాలలు వృత్తి శిక్షణా కేంద్రాలు, స్త్రీ విద్యా శిక్షణా కేంద్రాలు, సంస్కృత పాఠశాలలు, ఉచిత వైద్యశాలలు, అనాథ శరణాలయాలు స్థాపించి సమాజసేవ చేశారు. అవిద్య వలననే ప్రజలలో పరస్పర ద్వేషభావములు పెరిగి అశాంతికి గురి అవుతున్నారని లాలాజీ గుర్తించారు. పంజాబులో విద్యలేని గ్రామం గాని, గ్రామంలో విద్య లేని కుటుంబంగాని, కుటుంబంలో విద్య లేని వ్యక్తిగాని వుండరాదన్నదే లాలా లజపతిరాయ్ ఆశయం. లాలాజీ ఎంతో శ్రమపడి విరాళములు సేకరించి 16 ఉన్నత పాఠశాలలు, ఒక మహిళా విద్యాలయం స్థాపించినారు. హరిజన విద్యార్థులకు ఉచిత విద్య, ఉపకార వేతనాలు ఏర్పాటు చేసినారు. అంతేకాక బాలగంగాధరతిలక్ పేర

తిలక్ రాజకీయ కళాశాలను స్థాపించి, దానికి 40 వేల రూపాయిల విరాళమును యిచ్చి, లాహోర్‌లో నున్న తన స్వంత భవనాన్ని కూడా యిచ్చిన త్యాగశీలి లాలాజీ. 1902 సం.లో లార్డ్ కర్జన్ ఏర్పాటు చేసిన విద్యాసంబంధమైన ఒక విచారణ సంఘము నందు సాక్ష్యమిస్తూ "ఈ ప్రభుత్వ విధానమును నేను నిరసిస్తున్నాను. ఇది భారతీయులలో ఇప్పుడిప్పుడే అంకురించే స్వేచ్ఛా బీజాలను సర్వనాశనం చేయుటకు దోహదపడుతుంది. పూనాలోని ఫెర్గూసన్ కాలేజీ, కలకత్తాలో గల కేంద్ర విద్యాసంస్థ, లాహోర్ గల ఆంగ్ల వైదిక కళాశాలలు చేస్తున్న విద్యాసేవలను ఎందుకు ఈ ప్రభుత్వం గుర్తించదు? అవి నిలబడటానికి కావలసిన పరిస్థితులను ఎందుకు కల్పించదు? 24 కోట్ల భారతీయులకు విద్యాసంబంధమైన పద్దుక్రింద ఆంగ్ల ప్రభుత్వం రు. 1 కోటి, 4 లక్షలు మాత్రమే వెచ్చిస్తూ భారత జనాభాలో 1/6 వంతు కూడా లేని ఆంగ్లేయుల కోసం ఇంగ్లండులో ఈ పద్దుక్రింద రు 18 కోట్లు ఖర్చు చేస్తున్నది. ఎందుకు ఇంత పక్షపాత వైఖరిని ఈ ప్రభుత్వం అనుసరిస్తున్నది?...ఉపాధ్యాయ వేతనాలు మరీ హీనంగా వున్నాయి" అని లాలాజీ ధైర్యంగా వాస్తవాన్ని చెప్పారు. ఈ విషయాన్ని పరిశీలిస్తే లాలాజీకి విద్యావ్యవస్థపట్ల, విద్యావ్యాప్తిపట్ల ఎంతటి అభిరుచి, ఆసక్తి కలదో మనకు అర్థమవుతుంది.

లాలాజీ గొప్ప రచయిత, పత్రికా సంపాదకుడు, బహు గ్రంథకర్త, మరియు గొప్ప జీవితచరిత్రకారుడు (A Great Biographist) ఈయన వ్రాసినన్ని జీవిత చరిత్రలు, ఆయన సమకాలికులెవరూ వ్రాయలేదు. ఇటలీ దేశభక్తులైన మాజాని, గారిబాల్డి జీవితచరిత్రలను శివాజీ, అశోక సామ్రాట్ జీవితచరిత్రలు ఈయన రచించెను. శ్రీకృష్ణుని చరిత్ర, స్వామి దయానంద చరిత్రలు ఉర్దూ భాషలో రచించటం విశేషం. లాలాజీ తన ఆత్మకథను తానే వ్రాసుకొనినారు. "అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని, జపానులోని భారతీయ విప్లవవాదులు", "అమెరికన్‌ల దృష్టిలో భారతీయులు", "తరుణభారతం", "ఆర్యసమాజ్", ''India in Bondage'', ''England's Debt to India''' "Unhappy India'', "భారత రాజకీయ భవిష్యత్తు" మొదలగు ఎన్నో గ్రంథాలను ఈయన రచించినారు. బ్రిటీష్ ప్రభుత్వ దోపిడీ ఆర్థికవిధానాన్ని, సామ్రాజ్య వాదాన్ని, బూటకపు రాజకీయ ఎత్తుగడలను ప్రపంచానికి తెలియజేయడానికి, భారతీయులలో దేశభక్తిని, జాతీయ భావాన్ని రగుల్కొల్పటమే ఈ గ్రంథముల ప్రధాన ఉద్దేశ్యము. "భారతదేశపు జాతీయ విద్యా సమస్యలు", అను గ్రంథంలో లాలాజీ జాతీయ విద్యను గురించి తన భావాలను ఈ విధంగా తెలియజేశారు. "జాతీయ విద్య అంటే జాతి వికాసము కలిగించే విద్య" అని నూతన నిర్వచనాన్ని యిచ్చారు. పత్రికా స్వేచ్ఛను గురించి మాట్లాడుతూ లాలాజీ "నాకే గనుక పూర్తి స్వేచ్ఛ వుంటే పత్రికల మొదటి పేజీలో, పెద్ద అక్షరాలతో Milk for the infants, food for the adults, education for all'' అని ముద్రించేవాడ నన్నారు. విద్యావ్యాప్తివలన మాత్రమే దేశం విముక్తి చెందుతుంది, అభివృద్ధి చెందుతుంది, అజ్ఞానం వైదొలగు తుందని చాటి చెప్పారు లాలాజీ.

రాజకీయాలకన్నా, సంఘ సంస్కరణ ముఖ్యమని లాలాజీ భావించారు. హరిజనోద్ధరణ సంఘం ద్వారా అస్పృశ్యతా నివారణకు అనేక కార్యక్రమాలను చేబట్టారు. 1889 సం లో అలహాబాద్‌లో జరిగిన 4వ జాతీయ కాంగ్రేసు మహాసభకు మొట్టమొదటిసారిగా హాజరైనారు. ఆనాడు కొంతమంది విద్యాధికులు, ఉద్యోగస్తుల ఆధీనంలో వుండి Pry, Pittion, Protest (ప్రార్థనలు, విన్నపములు, నిరసనలు) లు చేయటమే ఆనాటి కాంగ్రేసు విధానములు. ఇది లాలాజీకి ఏమాత్రం రుచించలేదు. 1893 సం.లో లాహోర్ కాంగ్రేసు సమావేశంలో తిలక్‌తో ఈయనకు తొలి పరిచయం ఏర్పడింది. 1900 సం.లో జరిగిన

"స్వదేశీ ఉద్యమం మనలో ఆత్మగౌరవం (Self-Respect), ఆత్మవిశ్వాసం (Self-Confidence), స్వయంపోషకత్వం (Self-Supporting), స్వార్థత్యాగం (Self-Sacrifice) లను పెంపొందిస్తుంది. మత భేదాలను పోగొట్టి మనల్ని సమైక్యపరుస్తుంది. మన మాతృభూమి కోసం దృఢ విశ్వాసంతో హృదయపూర్వకంగా చేతులు కలిపి పని చేయడానికి ఇది తోడ్పడుతుంది. సమైక్య భారతానికి ఈ స్వదేశీ ధర్మమే మత ధర్మంగా వుండాలి."

— లాలాలజపతిరాయ్

కాంగ్రెసు సమావేశంలో సాంకేతిక విద్య, పారిశ్రామిక సమస్యలపైన లాలాజీ రెండు తీర్మానములను ప్రతిపాదించగా వాటిని కాంగ్రెసు ఆమోదించింది. ఈ తీర్మానముల ఫలితమే స్వదేశీ, స్వరాజ్య ఉద్యమాలు. 1904 సం.లో ఇంగ్లండులో ఎన్నికలు జరుగుతున్న సమయంలో, భారత దేశంలోని బ్రిటీష్ ప్రభుత్వ వైఖరిని బ్రిటీష్ ప్రజలకు తెలియచేసే నిమిత్తం కాంగ్రెసు పంపిన ప్రతినిధివర్గంలో లాలాజీ కూడా ఉన్నారు. ఈయన మాంచెష్టర్, లీడ్స్, ఎడన్‌బర్గ్, గ్లాస్కో, లండన్ నగరాలలో ఉపన్యసించి భారతీయుల స్థితిగతులను వివరించారు. కొంతవరకు లేబర్ పార్టీ, ఐరిష్ పార్లమెంటు సభ్యుల సానుభూతిని సంపాదించ గలిగారు. దాదాభాయ్‌నౌరోజి మొదలగు ఎందరో దేశ భక్తులతో పరిచయం ఏర్పడింది. అక్కడ నుంచి అమెరికా వెళ్ళి 1905 సం॥లో స్వదేశం చేరుకున్నారు.

1905 సం॥లో బెంగాల్ విభజనతో వందేమాతరం ఉద్యమం ప్రారంభించబడింది. లాల్, బాల్, పాల్‌లు దేశవ్యాప్తంగా పర్యటించి, బ్రిటీషువారి కుటిల రాజకీయ నీతిని ప్రజలకు బహిర్గతం చేసి, దేశ ప్రజలను చైతన్యవంతులను గావించి, ఒక నూతన అధ్యాయమును సృష్టించారు.

1906 సంవత్సరంలో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు సమావేశంలో స్వదేశీ ఉద్యమ ఆవశ్యకతను వివరించారు. వందేమాతర ఉద్యమంతో జాతీయ ఉద్యమం ప్రజా ఉద్యమంగా రూపొందింది. పంజాబీ పత్రిక సంపాదకుని అధినేతను బ్రిటీష్ ప్రభుత్వం నిర్బంధించినందులకు లాలాజీ తీవ్రంగా విమర్శించగా బ్రిటీష్ ప్రభుత్వం లాలాజీని ఒక గొప్ప విప్లవకారుడని భావించి 1907 సం.లో లాలాజీని మాండలే జైలుకు పంపించింది. దీనితో దేశమంతటా అశాంతి ప్రజ్వరిల్లి, తీవ్ర స్థాయిలో నిరసనలు, ప్రదర్శనలు జరిగాయి. గోఖలే, తిలక్‌లు కూడా తమ నిరసనను తెలియజేసినారు. ఈ ఆందోళనకు తట్టుకోలేక, భయపడి బ్రిటీష్ ప్రభుత్వం 6 నెలల తరువాత లాలాజీని విడుదల చేసింది. ఈ ప్రవాసం వలననే లాలాజీకి "పంజాబు కేసరి" అని బిరుదు వచ్చింది.

1907 సంవత్సరంలో సూరత్‌లో జరిగిన కాంగ్రెసు సమావేశం భారత జాతీయ కాంగ్రెసు చరిత్రలో ఒక మలుపుకు కారణమైంది. సూరత్‌లో ఒక ప్రత్యేకమైన సమావేశంలో లాలాజీ జాతీయ సమైక్యత ఆవశ్యకతను గురించి మాట్లాడుతూ "ఇంతవరకు భారతదేశం భౌగోళికంగా మాత్రమే ఏక ఖండంగా అలరారింది. ఇప్పుడు ఆసేతు హిమాచలం ప్రాశ్చాత్య పరిపాలనా ప్రభావం వలన రాజకీయంగా సుసంఘటితమైనది. అయితే "విభజించి పాలించు" అనే బ్రిటీషు కుటిల రాజకీయనీతివలన మనలో విభేదాలు, చీలికలు తీసుకొని రావటానికి ప్రయత్నిస్తున్నారు. ఆంగ్లేయుల చేతిలో

( తరువాయి 44 వ పేజీలో )

# షిరిడీ సాయి పర్తి సాయి

" పత్రి గ్రామ సముద్భూతం
ద్వారకామాయి వాసినమ్
భక్తాభీష్టం ప్రదం దేవం
సాయినాథం నమామ్యహమ్ "

ఈనాడు నవరాత్రులను గురించిగాని, లేక శివరాత్రిని గురించి గాని నేను చెప్పదలచుకోలేదు. ఇంతవరకు ఎవ్వరికీ తెలియని విషయములు చెప్పడానికి పూనుకున్నాను. నైజాం రాష్ట్రంలో మారుమూల నున్న కుగ్రామం 'పత్రి'. ఈ గ్రామంలో గంగాభవాన్యుడు, దేవగిరియమ్మ అనే దంపతులుండేవారు. వీరికి సంతానము లేదు. దేవగిరియమ్మ గౌరీదేవి భక్తురాలు. గంగాభవాన్యుడు ఈశ్వరభక్తుడు. వీరిరువురూ పార్వతీ పరమేశ్వరులను నిరంతరం పూజిస్తుండేవారు. గంగాభవాన్యుడు పడవలను నడుపుకొని కాలం గడుపుతుండేవాడు. వర్షాకాలం రావటంచేత, నది ఉప్పొంగటంచేత గట్టున ఉన్న పడవలు కొట్టుకొనిపోతాయేమోనని, భార్యతో చెప్పి, ఒకనాటి రాత్రి భోజనం చేసి వెళ్ళిపోతాడు. రాత్రి 9 గం. అయింది. ఎవరో తలుపు కొట్టగా, భర్తే తిరిగివచ్చాడేమోననే ఆతురతతో తలుపు తెరుస్తుంది దేవగిరియమ్మ. ఎవరో ఒక అపరిచితుడైన వృద్ధుడు లోనికి ప్రవేశిస్తాడు. అమ్మా! నాకు బయట చాలా చలిగా వున్నది, నాకు లోపల ఇంత అవకాశ మందించమంటాడు. ఆమె చాలా ఉత్తమురాలు కనుక వరండా తలుపు తెరచి, అక్కడ పడుకోమని చెప్పి, తలుపు వేసుకొని లోపలికి పోయింది. మరికొంతసేపటికి లోపలి తలుపును తడతాడు ఆ వృద్ధుడు. తిరిగి తలుపు తెరుస్తుంది. అమ్మా! నాకు ఆకలిగా వుంది, ఇంత అన్నం పెట్టమంటాడు. అయ్యో! ఏమీ లేదే! అని బాధపడుతూ అక్కడయక్కడ వుండి నటువంటి పిండి తెచ్చి కొంచం పెరుగులో కలిపి తెచ్చిపెడుతుంది. తలుపు వేసుకున్న కొంచంసేపటికి మళ్ళీ తలుపు తడతాడు. ఆమె తలుపు తిరిగితెరుస్తుంది. అమ్మా! నాకు కాళ్ళు నొప్పిగా ఉన్నాయి. కొంచం పత్తుతావా? అని అంటాడు. ఆమె లోపలికి వెళ్ళి పూజా గదిలో కూర్చొని "తల్లీ! ఏమిటి ఈ పరీక్ష నాకు. ఈ సమయంలో నేను ఏమి చేసేది? నేను స్త్రీని కదా! అతనికి సేవ చేయనా? వద్దా! నాకు ఇలాంటి పరిస్థితి

## శ్రీ సత్యసాయిబాబా

తెప్పించావేమిటి తల్లీ!" అని పార్వతీదేవిని ప్రార్థిస్తూ ఏడుస్తుంది దేవగిరియమ్మ. కొంతసేపటికి వెనుకనున్న దొడ్డితలుపు గుండా బయటకు పోయి, ఇలాంటి సేవ చేసేవారు ఎవరైనా దొరుకుతారేమోనని, డబ్బు అయినా యిచ్చి తీసుకొనివద్దామని ప్రయత్నిస్తుంది. ఎంత ప్రయత్నించినా ఎవరూ ఆమెకు కనిపించలేదు. నిరాశతో తిరిగి ఇంటికి చేరింది. ఏమీ చేయాలో తోచక మదనపడుతున్న సమయంలో మళ్ళీ ఆ వృద్ధుడు తలుపు కొడుతాడు. అదే సమయంలో వెనుక దొడ్డితలుపు నుండి ఒక స్త్రీ వస్తుంది. "అమ్మా నీవేమో మా ఇంటికి వచ్చావుట. ఒక ముసలివానికి సేవ చేయాలని పిలిచావుట. అప్పుడు నేను ఇంటిలో లేను. నేను ఇప్పుడే వచ్చాను. నేను ఎవరికి సేవ చేయాలి?" అని అడుగుతుంది. అప్పుడు దేవగిరియమ్మ పూజా గదిలోనికి వెళ్ళి అనందంతో నా పార్వతీదేవే ఈమెను పంపివుంటుందని

కృతజ్ఞతతో దేవికి నమస్కరించి బయటకు వచ్చి ఆమెను వరండాలోనికి పంపించి, ఆ వృద్ధునికి సేవ చేయమంటుంది. తరువాత తలుపు వేసుకుంటుంది. ఆ వచ్చిన ఇరువురూ పార్వతీ పరమేశ్వరులు. ఈశ్వరుడు పార్వతితో ఆమె మనోభీష్టాన్ని నెరవేర్చమంటాడు. మీరు ప్రదీపులు కదా! మీరే అనుగ్రహించవలంటుంది పార్వతి. నేను పరీక్షించడం కోసం వచ్చినవాడను, నీవు ప్రార్థన విని వచ్చినదానివి కనుక నీవే ఆ వరం అనుగ్రహించాలంటాడు ఈశ్వరుడు. తిరిగి తలుపు తడుతాడు. ఒక స్త్రీ వుందికదాయనే ధైర్యంతో తలుపు తెరుస్తుంది దేవగిరియమ్మ. వారిరువురూ పార్వతీ పరమేశ్వరులుగా దర్శనమిస్తారు. దేవగిరియమ్మ ఆనందమును భరించుకోలేక వారి పాదాలపై పడుతుంది. అప్పుడు పార్వతీ ఆశీర్వదిస్తుంది, వంశోద్ధారణకు ఒక కుమారుడు, కన్యాదానమునకు ఒక కన్యను నీకు అనుగ్రహించానంటుంది. అప్పుడు దేవగిరియమ్మ మరల ఈశ్వరుని పాదాలపై పడుతుంది. అమ్మా! నీ భక్తికి సంతోషించాను. మూడో గర్భంలో నేనే వచ్చి పుడతానంటాడు ఈశ్వరుడు. ఈ విధంగా నమస్కారం చేసి లేచేటప్పటికీ వారిరువురూ అదృశ్యమవుతారు. ఆనందంతో దేవగిరియమ్మ పొంగిపోతుంది. ఎప్పుడు తెల్లవారుతుందా? ఎప్పుడు భర్త వస్తాడా? ఈ విషయం చెబుదామా! అనే ఆనందంతో తెల్లవార్లూ మేల్కొనివుంటుంది. తెల్లవారేటప్పటికీ భర్త వస్తాడు. అతనికి రాత్రి జరిగినదంతా పూసగుచ్చినట్లు చెబుతుంది. భర్త నమ్మడు. "దేవగిరి! ఏమిటి నీకు ఈ పిచ్చి! కాని ఏదో కల వచ్చి వుంటుంది. పార్వతి ఏమిటి? పరమేశ్వరుడు ఏమిటి?" అని హేళనగా మాట్లాడుతాడు. ఆమె ఎన్ని విధముల చెప్పినా భర్త నమ్మడు.

ఈ విధంగా కొంతకాలం గడుస్తూండగా దేవగిరియమ్మ గర్భవతి అవుతుంది. కుమారుడు పుడతాడు. మరునటి సంవత్సరానికి కుమార్తె కూడా కలుగుతుంది. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షం కావటం నిజమే అయివుంటుందని విశ్వసిస్తాడు భర్త. నీకు ఆ ప్రాప్తి సంభవించింది కాని నాకు అది ప్రాప్తించలేదని బాధపడుతాడు. దేవగిరియమ్మ మూడవ గర్భం దాలుస్తుంది. అతనిలో చాలా మార్పు వచ్చినట్లు కనిపిస్తుంది. ఇల్లు విడిచి వెళ్ళాలి, తపస్సు చేయాలి, ఎట్లాగయినా పార్వతీ పరమేశ్వరులను ప్రత్యక్షం చేసుకోవాలని మనసు ఆరాటపడుతుంటుంది. అరణ్యాలకు వెళ్ళాటానికి కృతనిశ్చయుడవుతాడు. ఈ లోగా దేవగిరియమ్మకు నవమాసాలు నిండుతాయి. నేను అరణ్యాలకు వెళ్ళిపోతున్నానని చెప్పి బయలుదేరుతాడు. పతియే దైవముగా భావించిన దేవగిరియమ్మ కూడా పతిని అనుసరిస్తూ వెంట బయలుదేరుతుంది. కొంచం దూరం పోయేసరికి ఈమెకు ప్రసవవేదన ఎక్కువవుతుంది. అక్కడనే ప్రసవిస్తుంది. తన చీరగుడ్డలలో ఆ పసివాడిని పెడుతుంది. ఆ సమీప గ్రామంలోనే సూఫీ మతమునకు చెందిన ఒక ఫకీర్ వుండేవాడు. అతనికికూడా పుత్రులు లేకపోవటంవలన ఆ పిల్లవాడిని తీసుకొనివచ్చి పెంచుకుంటాడు. కనుకనే ఎవరికి పుట్టాడు? ఎప్పుడు పుట్టాడు? అని ఎవ్వరికీ తెలియదు. కనుకనే బాబా చరిత్రంతా షిరిడీకి వచ్చినప్పటినుండి మాత్రమే అందరూ తెలుపుతూవచ్చారు. 1835 సం॥ సెప్టెంబర్ 28వ తేదీ బాబా జన్మదినం. అది ఈనాడే. 1835 సం॥ నుండి 1839 సం॥ వరకు అనగా నాలుగు సంవత్సరాలు ఆ ఫకీరు ఇంట్లో పెరిగాడు ఆ బాలుడు. అయితే కాలకర్మకారణ కర్తవ్యాలు కలిసిరావటంచేత ఆ ఫకీరు మరణించాడు. ఆ ఫకీరు భార్య చాలా విచారించింది. దీనికి తోడు ఆ పిల్లవాడు విరుద్ధమైన చేష్టలు చేస్తూవచ్చాడు. ఆ ప్రదేశాలలో హిందూ ముస్లిం మతభేదాలు పెచ్చుపెరిగినటువంటి రోజులవి. ఆ పిల్లవాడు హిందూ దేవాలయములకు వెళ్ళి "మై అల్లాహూ, అల్లా మాలిక్ హై" అని కేకలు వేసేటటువంటివాడు. హిందువుడు కోపోద్రిక్తులై ఆ పిల్లవాడిని అనేక రకములుగా శిక్షించేవారు. మహమ్మదీయుల మసీదులలోనికి వెళ్ళి "రాముడే దేవుడు, శివుడే అల్లా" అని అరిచేవాడు. దీనితో ముస్లిములు కూడా ఉగ్రులై ఆ పిల్లవాడిని బాధించేవారు. ఇరు మతములవారు వచ్చి ఆ ఫకీరు భార్యకు ఫిర్యాదు చేసేవారు. ఆ పిల్లవాడి చేష్టలకు భరించుకోలేక ఆ ఫకీరు భార్య అచటికి అతి సమీపంలో

నున్న వెంకూసాదాస్ అనే ఒక సాధువునకు వప్ప జెప్పింది. 1839 సం॥ నుండి 1851 సం॥ దాకా ఆ వెంకూసాదాస్ ఆశ్రమంలో ఆ పిల్లవాడు వున్నాడు. వెంకూసా ఆ పిల్లవాడిని అతిగా ప్రేమించేవాడు. ఏ ఒక్క విషయమునందైనా సరే ఆ పిల్లవాడికే ప్రథమస్థానం ఇచ్చేవాడు వెంకూసా. దీనిని చూచిన ఆ ఆశ్రమవాసులలో అసూయ బయలుదేరింది.

1851 సం॥ అనగా 12 సం॥ తరువాత ఆశ్రమం వదలి ప్రయాణమైనాడు ఆ పిల్లవాడు. షిరిడీ చేరినాడు. అక్కడ రెండు నెలలు మాత్రమే వుండి అక్కడినుంచి కూడనూ సంచారం జరుపుతూ పోయాడు. కొన్ని సంవత్సరములు తిరిగి తిరిగి "ధూక్కెడా" అనే గ్రామం చేరాడు. ఆ గ్రామంలో నివాసంచేస్తుండగా చందూబాయ్ పటేల్ తమ్ముని కుమారుని వివాహం జరిగింది. ఆ పెండ్లివారితో కలిసి తిరిగి షిరిడీ చేరాడు. అది 1858వ సంవత్సరం. అప్పటినుంచి 1918 సం॥ వరకు షిరిడీని వదలి వెళ్ళలేదు. అక్కడనే వుండి వచ్చేవారితో సంభాషణలు జరపటం, కష్టములకు కొన్ని ఉపయోపాయములను సూచించటంతో కాలం గడుపుతూ వచ్చాడు. క్రమక్రమేణా ఆ బాబుని యొక్క విశేషాలు పరిసర ప్రాంతాలకు వ్యాపించుతూపోయింది.

బొంబాయి రాష్ట్రంలో డిప్యూటీ కలక్టర్‌గా పనిచేస్తున్న హరివినాయకసాతే ఉండేవాడు. ఇతను భార్యా వియోగం చేత చాలా బాధపడుతుండేవాడు. ఒకరోజున ప్రొ. జి. జి. రాంఛే అనే స్నేహితుడు సాతే ఇంటికి వచ్చి ధైర్యం చెప్పి కొంతకాలం ఈ స్థానం వదలి ఎవరైనా మహనీయుని దర్శించితే బాగుంటుందని చెప్పి షిరిడీకి తీసుకొనివస్తాడు. బాబాను దర్శిస్తారు. బాబా సాతే వైపు చూస్తూ, నవ్వుతూ, చేతులు త్రిప్పుతూ అనేక రకములుగా ఆడిస్తూవుంటాడు. ఇతనేమైనా పిచ్చివాడా ! అని సాతే మొదట్లో భావిస్తాడు. సాతే బాబాను దర్శనంచేసుకొని నిల్చుంటాడు. ఇతని పేరును తన మిత్రుడు బాబాకు చెప్పలేదు. "సాతే ఫికర్ నైకరో ! ( నీవు విచారించవద్దు ). దేహములు నీటి బుడగలు కదా ! కనుక ఇట్టి దేహముపైన నీవు భ్రాంతిని అభివృద్ధిపరచుకొనవద్దు. దేహిపై అభిమానమును అభివృద్ధిపరచుకో. విచారములు కదిలిపోయే మేఘములు. ప్రతి వ్యక్తికీ ఇలాంటి దుఃఖములు సంభవిస్తూవుంటాయి. ధైర్యం వహించు! బిడ్డను కాపాడుకో!" అని బాబా అంటాడు. అంతకు పూర్వమే సాతే భార్య ప్రసవించి ఒక బిడ్డను కని మరణిస్తుంది. బిడ్డవున్న విషయం అతని స్నేహితుడు రాంఛేకుకూడా తెలియదు. బాబా నోటి వెంబడి ఈ వాస్తవం వినేటప్పటికి బాబా నిజంగా "త్రికాలజ్ఞాని" అని సాతే విశ్వసిస్తాడు. ఆదిలో బాబాని చూచివద్దామని భావించిన సాతే మరికొన్ని దినములు అక్కడే వుండిపోతాడు. తరువాత తరచుగా వస్తూ... పోతూ... బాబాను దర్శించుకుంటుండేవాడు. అక్కడ భక్తులకు తగినటువంటి వసతులులేవని భావించి మొట్టమొదట వసతి గృహమును నిర్మించినటువంటివాడు సాతే. దానినే 'సాతేవాడా' అని పిలుస్తుంటారు. సాతేకు బాబాయెడల గౌరవం, భక్తి పెరిగింది. "నేను సంపాదించి ఎవరికి యివ్వాలి? " అనే విరక్తి జనిస్తుంది. షిరిడీకి తరచుగా వస్తూ సేవలు చేస్తుంటాడు. ఒక పర్యాయం బాబా నవ్వుతూ " సాతే ! నీవు ఉద్యోగంపై విరక్తి పొందినట్లుగా ఉంది. నీవు సంపాదించిన ధనము ఎవరికివ్వాలా ? అని విచారిస్తున్నావు. ఎవరికివ్వాట మేమిటి ? మంచి కార్యములు చేయి ! మన షిరిడీకి కోటగా కట్టు ! " అని అనగా " స్వామీ ! నేను లక్షాధికారిని కాదుగదా ! ఇంత పెద్దకోట నేను ఎట్లు నిర్మించగలను ? " అని ప్రార్థిస్తాడు. " చేతనయినంతవరకు చేస్తూరా ! నేనుండగా భయమెందుకు ? Why Fear ?" అన్నాడు బాబా. బాబా పలుకులు అతనికి ధైర్యాన్ని యిచ్చాయి. కొంతకాలం తరువాత అతని మేనమామ " దాదాకేల్కర్ " కూడా వచ్చి షిరిడీలో స్థిరనివాసం ఏర్పరచుకున్నాడు. సాతే పూనానుండి రుబ్బులు పంపడం ఆయన మేనమామ ఆ డబ్బుతో షిరిడీలో కట్టడాలు కట్టటం జరుగుతుండేది. ఈ విధంగా సాతేను ఒక పనిముట్టుగా ఉపయోగించుకున్నాడు బాబా. క్రమక్రమేణా అన్ని కార్యములయందును సాతే ప్రధానమైన వ్యక్తిగా పరిగణిస్తూ రావటం వలన షిరిడీలోని వారికి సాతేపైన అసూయ ప్రారంభమైంది.

బాబాకు చాడీలు చెప్పటం ప్రారంభించారు. ఇలాంటి చాడీలు చెప్పే వారికి ఏ పేరు పెట్టవలయును? బిచ్చకునకు శత్రువని పెట్టవలయును. ఏమిటా శత్రువులు? కుక్కలు. చూసారా! ఇలాంటి చాడీలు చెప్పేవారు కుక్కలతో సమానం అని చెబుతారు.

బాబా దగ్గర ఎవరు వచ్చినా 'దక్షిణ, దక్షిణ!' అంటూ డబ్బులు తీసుకొనేవాడు. అధికంగా తీసుకునే వాడుకాదు. ఐదు రూపాయలకు మించి తీసుకునేవాడు కాదు. తీసుకున్న డబ్బు అతనివద్ద వుంచుకొనేవాడు కాదు. ఇక్కడ తీసుకోవటం! అక్కడ యిచ్చివేయటం జరిగేది. ఒకనాడు 'ప్రధాన్' అనేటటువంటి వ్యక్తి వచ్చాడు. అతను బాబాకు రు 20 లు యివ్వాలనుకున్నాడు. ఆ రోజులలో నోట్లులేవు, అన్నీ వెండి రూపాయలే. ఒక రూపాయి ఒక తులం బరువుండేది. ఇంత చిల్లర ఎట్లా యిచ్చేదని ఒక బంగారు నాణెం (శౌరి) తీసుకొనివచ్చాడు. దానిని ఇటూ, అటూ త్రిప్పి చూచాడు బాబా. ఏమిటిది? నేనెప్పుడూ చూడలేదే? అన్నాడు. ప్రక్కన ఉండినటువంటి వ్యక్తి, ఇది బంగారు నాణెం అన్నాడు. అప్పుడు "ఇది నాకక్కర లేదు. నాకు రూపాయిలే కావాలి. ఈ నాణెం ఎన్ని రూపాయిలవుతుంది?" అన్నాడు బాబా. ఆనాడు ఒక శౌరి బంగారునాణెం రు.15 లు వుండేది కనుక రు.15 లు వచ్చాడు. ఇంకా నాకు రు. 5 లు రావాలన్నాడు బాబా. ఇదేమిటి? ఇంకా రు. 5 లు అధికంగా అడుగుతున్నాడేమిటని ప్రధాన్ ఆలోచించనారంభించాడు. "మొదట రు. 5 లు నాకు యిచ్చి యోచన చేయి! నీకే తెలుస్తుంది" అన్నాడు బాబా. ప్రధాన్ ఇచ్చాడు. అప్పుడు బాబా "నీవు ఇంటి దగ్గర ఏమనుకొని వచ్చావు? రు. 20 లు యివ్వాలనుకొని వచ్చావుగదా! ఇప్పుడు రు. 15 లే యిచ్చావు ఇంకా రు.5 లు నావేకదా! అందువల్లనే ఆ రు. 5 లు అడిగాను" అన్నాడు. దానితో ప్రధాన్ (జడ్జిగా చేస్తున్నాడు) బుర్ర తిరిగిపోయింది. సాయిబాబామే సరియైన జడ్జి అనుకున్నాడు ప్రధాన్. ఈవిధంగా తన దగ్గర వచ్చినవారినుండి డబ్బు తీసుకోవటం, అప్పటికప్పుడే బీదవారికంతా ఇచ్చివేయటం బాబాకు ఒక అలవాటు.

ఒకనాడు దాదాకేల్కార్‌ను పిలిచి "ఈనాడు గురుపూర్ణిమ గురుపూజ చేయి!" అన్నారు బాబా. గురుపూజ అంటే ఏమిటి? అని ప్రశ్నించారు కేల్కార్. "గురువంటే ఏవరనుకున్నావ్? కేవలం మఠాధిపతులు కాదు, సన్యాసులు కాదు గురువులు. బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపులే నిజమైన గురువులు. సృష్టి స్థితిలయకారకులైనటువంటివారే గురువులు. ఒక్క భగవంతుడే గురువు" అని చెప్పాడు బాబా. అప్పుడు నేను పూజవిష్ణువుని చేయాలా? బ్రహ్మను చేయాలా? రుద్రుని చేయాలా? అని కేల్కార్ అడిగేటప్పటికే "ఒరేయ్! సైతాన్! ఉన్నాను గదా యిక్కడ. చేయి!" అన్నాడు బాబా. అనగా తానే బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుడని. 'త్వమేవాఽహం' ఇలాంటి నేను, నేనుగా ఉండినటువంటి తత్వాన్ని నీవు పూజించు అన్నాడు బాబా. దీనితో షిరిడీకి వచ్చేవారందరూ కూడను సాక్షాత్ పరమేశ్వరు స్వరూపుడు షిరిడీ సాయిబాబా యని విశ్వసిస్తూ వచ్చారు.

అయితే సాతేపైన ద్వేషమును పెంచుకొని పగ సాధించటానికి ప్రయత్నాలు చేస్తున్నారు షిరిడీలో వుండినటువంటివారు. దీనికి కారణమేమనగా వచ్చిన దక్షిణలంతా కూడను ఒక హుండీ మాదిరిది పెట్టి, దాన్ని సంరక్షించుకొని, భవనాలను నిర్మించాలని భావించాడు సాతే. దీనికి తగినట్లుగా పాపం! సాతే దురదృష్టం అనుకోవచ్చు. అక్కడ వుండే వెండి రథమును ఎవరో దొంగలు ఎత్తుకొనిపోయారు. సాతే ప్రధానట్రస్టీలు కాపటంవలన అపవాదు ఆయనమీద వేసారు. ఒకనాడు ఒక వ్యక్తి గొడ్డలి తీసుకొని, సాతే ప్రయాణమై వెళ్ళే త్రోవలో కాపు కాచారు. ఈ దృశ్యాన్ని సాతే మామ చూచి "నీవు ఇంక ఇక్కడ వుండవద్దు. ఎక్కడికైనా వెళ్ళిపోయి అక్కడనే బాబాని స్మరించుకో. తక్షణమే ఈ షిరిడీని వదలిపో" అని చెబుతాడు. సాతే షిరిడీని వదలలేక వదలి వెళ్ళిపోతాడు. క్షణక్షణము బాబా "సాతే...సాతే..." అని పిలుస్తూ వచ్చాడు. కాని, సాతే కనిపించకపోవడంతో బాబా విచారంగా వుంటూ వచ్చాడు. సాతే అతిప్రియుడు,

(తరువాయి 42వ పేజీలో)

# నారద భక్తిసూత్రాలు - 4

# లక్షణావళి

( గత సంచిక తరువాయి )

**19. నారదస్తు తదర్పితాఖిలాచారతా తద్విస్మరణే పరమ వ్యాకుల తేతి**

నారాయణునికి సర్వసమర్పణ చేయటం-విష్ణుదేవుని గూర్చి విస్మరణ కలిగితే పరమ వ్యాకులత పొందటం భక్తి అని నారదమహర్షి అభిప్రాయం.

వ్యాస గర్గ శాండిల్యాదులు భక్తి దృఢపడటానికి లక్షణాలు పేర్కొని అకళంకమైన భక్తితత్త్వాన్ని వెల్లడించారు.

భగవంతుని పూజనం, దైవ కథాదుల శ్రవణం, ఆత్మరతి యందాసక్తి, అవరం అనీ, అన్నిటికంటె ఆత్మనివేదనం, విష్ణుస్మరణం ముఖ్యం అనీ నారద మహర్షి పరమభక్తిలోని సగుణ నిర్గుణారాధనలలోని సారాంశం తేల్చి చెప్పాడు.

వ్యాసమహర్షికి విష్ణుసేవా ప్రాశస్త్యం వివరించి ఆయనను శ్రీమద్భాగవతం రచించమని ప్రేరేపించినది నారద మహర్షియే. ఆ నారదమహర్షి అన్ని విధానాలను సమన్వయపరుస్తూ ఆత్మనివేదన ముఖ్యమని సర్వాంగ సంపూర్ణమైన భక్తి తత్త్వం నిర్దేశించాడు. పరమాత్మని సందర్శనానికి పరమ వ్యాకులత పడటమే భక్తి లక్షణం.

శ్రీ రామకృష్ణ పరమహంస కాళీమాతృ సందర్శనం కోసం కన్నీరు మున్నీరుగా విలపించటం, పరితపించటం పరమ వ్యాకులత పొందటం సర్వవిదితమే.

"అర్జునా ! తపస్వికంటె శాస్త్రవేత్తకంటె కర్మిష్ఠి కంటె యోగి సర్వశ్రేష్ఠుడు. నీవు యోగమూని యోగివి కమ్ము. అన్ని యోగాలలో భక్తి యోగం సర్వశ్రేష్ఠం-సర్వసులభం. కనుక భక్తియోగం అవలంబించు. త్రికరణ శుద్ధిగా నన్ను భజించు".

"సర్వదా అవిరామంగా నా నామస్మరణం చేయి. మనస్సులో నన్ను నిల్పి ఫలాపేక్ష వదలి నాకోసం యుద్ధం చేయి. నీ మనస్సును నాకు అర్పించు. ఆత్మ నివేదనమయిన తరువాత భక్తునికి బాధ్యత ఏమీ ఉండదు."

"మానావమానాలు లాభనష్టాలు జయాపజయాలు సుఖదుఃఖాలు నీవేమీ కావు. అవి అన్నీ నావి. అన్నీ చూచుకోవలసింది నేను. నీవు నిమిత్తమాత్రుడివి. అది మరవవద్దు" అని కృష్ణభగవానుడు ఉపదేశించాడు.

'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

కనుక భక్తుడు ఫలితం దైవార్పణంచేసి అహంకార మమకార రహితంగా పరమాత్మను ధ్యానం చేయాలి. శరణాగతి కోరి అవ్యయానందుని అత్యంత శ్రద్ధతో నిరంతరం మననం చేయాలి. నిత్యం నీరజాక్షుని పరిచర్యతో నిమగ్నమై ఉండాలి. "లోకాస్సమస్తా సుఖినో భవంతు" అంటూ లోకక్షేమంకోసం దృఢ దీక్షతో ప్రవర్తన సాగించాలి.

ఏ కారణం చేతనైనా విచలిత మనస్కుడవైతే, చింతనలో లోపం కలిగినందులకు నీళ్ళలోనుంచి బయటపడిన చేపవలె విలవిలలాడిపోవాలి. ఇదీ భక్తుని లక్షణం. ఇది సర్వోత్తమ పరమ భక్తి.

ఇలాంటి ఉత్తమ భక్తుడు త్రైలోక్య లక్ష్మి వచ్చి వరించినా, సాక్షాత్తు మోక్షలక్ష్మి కౌగిలించుకున్నా, ఏ పరిస్థితులలోనూ విష్ణునామ శ్రవణ స్మరణకీర్తనాదులను విడిచిపెట్టడు.

"ఓ ఉద్ధవా ! వాణీశ పార్వతీశాదులకంటే సహోదరులైన బలరామాదులకంటె అర్ధాంగి లక్ష్మీదేవి కంటె ఉత్తమ భక్తుడు నాకు ఇష్టుడు. ఏ వస్తువూ అపేక్షింపక ఏ కోరికా లేకుండా శాంతచిత్తుడైన అజాత శత్రువు అంటే నాకు మరీ ఇష్టం. సర్వసమభావంతో సర్వజీవులలో జడపదార్థాలలోకూడ నన్ను దర్శించే స్మరించే భక్తుని పాదధూళి నాకు ప్రియమైన వస్తువు" అని భక్తి తత్త్వాన్ని కృష్ణ దేవుడు ఉపదేశించాడు.

లౌకిక మొల్లక నన్నా
లోకించు ప్రసన్నులకును లోబడి కరుణా
లోకనముల పోషింతును
నాకాశ్రిత రక్షణములు నైసర్గికముల్

భక్తుడు అన్ని చరాచరాలలోను పరమాత్మను దర్శించాలి. అన్నింటిని పరమాత్మభావంతో సేవించాలి. అపుడు భక్తుడు అవ్యయానంద పరమసుఖం పొందుతాడు. ఆ సుఖంలోని అతి రుచికరమైన స్వాదురసం అన్యులెరుగరు.

భక్తులు పరమేశ్వర సాక్షాత్కారంకై పరితపించాలి అనేదే నారదుడు చెప్పిన భక్తి మార్గం.

బ్రహ్మదేవుడు నారదునికి తెలిపిన శ్రీ మహావిష్ణువు విరాట్ స్వరూప వర్ణనమిది.

బహు పాదోరు భుజాననేక్షణ
శిరః ఫాల శ్రవో యుక్తుడై
విహరించున్ బహుదేహి దేహగతుడై -
విద్వాంసులూహించి త
ద్బహు రూపావయవంబులన్
భువనసంపత్తిన్ విచారింతు రా
మహనీయాద్భుతమూర్తి యోగిజన
హృన్మాన్యుండు మేధానిధీ ! !

**20 సూ. అస్త్యేవ మేవమ్**

ఇదే నిజమైన భక్తి !

పరమభక్తి కొరకు వ్యాకులత పొందుటే నిజమైన సాధనా భక్తి. భక్తి సూక్ష్మతరమే కాక స్థూలతమం కూడ. దీని స్వరూప స్వభావాలు సువిశాలములు.

ప్రేమవల్ల శ్రద్ధ, శ్రద్ధ వలన జ్ఞానం, జ్ఞానంవలన సాధన, సాధన వలన సాధ్య భక్తి లభిస్తుంది. సాధ్య భక్తియే పరమ భక్తి. పరమ భక్తి వలన పరమాత్మ సాక్షాత్కారం సహజంగా లభిస్తుంది.

ప్రహ్లాదుడు విష్ణుదేవుని అన్ని వస్తువులలోనూ దర్శించాడు.

ఇందుగలడందు లేడని
సందేహములేదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెతకి చూచిన
అందందే గలడు దానవాగ్రణి ! వింటే !

ఓ రాక్షసరాజా ! నా మాట విశ్వసించి ఎక్కడ వెతకిచూస్తే శ్రీ మహావిష్ణువు అక్కడే కనిపిస్తాడు అని హిరణ్యకశిపునికి ప్రహ్లాదుడు నొక్కి వక్కాణించాడు. స్తంభంలో స్వామిని ప్రత్యక్షపరిచాడు. అట్టి అచంచల విశ్వాసమే భక్తి.

నొడివినంతపట్టు నుసలక నిచ్చుచో !
ఏలకట్టు విష్ణుడేటిమాట ?
కట్టెనేని దానకరుణించివిడుచును
విడువకుండనిమ్ము విమలచరిత ! !

అని మేరువు తలక్రిందైనా, సముద్రాలు ఇంకి ప్రళయం వచ్చినా, నేను విష్ణుమూర్తికి సర్వం సమర్పించాలిసిందే అని బలిచక్రవర్తి ఆత్మసమర్పణం చేసుకొన్నాడు.

"ఈ ఆత్మ నివేదనం అంటే - భావాద్వైత క్రియా ద్వైతాలు తెలుసుకొని సర్వ కర్మలు భగవదర్పణం చేయటం. దీనివలన ద్వైతభ్రమ పోతుంది.

ఉత్తమో బ్రహ్మసద్భావో
ధ్యాన భావస్తు మధ్యమః
స్తుతిర్జపోఽధమా భావో
బహిః పూజాధమాధమా !

ఆత్మాభ్యుదయ పథంలో బ్రహ్మానుభూతి పొందటం ఉత్తమం. మానసిక ఉపాసన మధ్యమం. బాహ్యాపూజ అధమం – అని మహానిర్వాణతంత్రకారుని అభిమతం.

ఆత్మజ్ఞానం – ఆత్మనివేదనం – సర్వసమర్పణం ప్రతి భక్తునికి అవసరమని నారదమహర్షి అభిభాషణం.

## 21 సూ. యథా వ్రజ గోపికానామ్

భక్తి అనేది గోపికల భక్తివలె ప్రగాఢమై ప్రస్ఫుటించాలి.

పరమ భక్తికి, ప్రేమ స్వరూపమైన నిష్కళంక మధుర భక్తికి వ్రజ గోపాంగనలు ఆదర్శప్రాయులు. వారి భక్తి నిశ్చలం, నిర్మలం, నిరుపమానం, నిరవధికం. ఆ భక్తిని వర్ణించే శక్తి వాణీ, వాణీశ, ఫణీశాదులకు కూడా లేదు. వారు మనం, ధనం, ఇహం, పరం, అన్నీ ఆ గోపాలదేవునికే అర్పించారు. ఆత్మలను అర్పించి అచ్యుతుని ఆరాధించారు. వారు రేబవలు క్షణం క్షణం అవిరామంగా అవిచ్ఛిన్నంగా గావించినది రంగనాథుని చింతనమే. కేశవ కీర్తనమే. వారు ఇతరం ఆలోచించరు. భక్తులైన వారు అంత తీవ్ర కామనతో భగవంతుని ఆరాధించాలి.

మోహన మురళీగానం వినిపించగానే ముగ్ధగోపాంగనలు భవనాలు వదలి వనాలకు పరుగులుపెట్టేవారు. అక్కడ స్వామి కనుమరుగైతే పొదపొదలో ఎదఎదలో వెతికేవారు. వారికి లౌకిక జ్ఞానం పోయింది. "అవి మాట్లాడతాయా" అని వారు అనుకోలేరు. పువ్వు పువ్వును అడిగారు. చెట్టు చెట్టును ప్రశ్నించారు. మొక్క మొక్కతోనూ మొరపెట్టుకొన్నారు.

నల్లనివాడు – పద్మ నయనమ్ములవాడు
కృపారసంబు పై
చల్లెడువాడు – మాళి పరిసర్పిత
పింఛమువాడు – నవ్వు రా
జిల్లెడు మోమువా–డొకడు చెల్వల
మానధనంబు తెచ్చె – ఓ
మల్లియలార ! మీ పొదలమాటున
లేడుగదమ్మ ! చెప్పరే !

అని మల్లెపూలను మరి మరీ అడిగారు.

అంగజునైన జూడ హృదయంగముడై
కరగించువాడు – (శ్రీ)
రంగదురంబువాడు – మధురంబగు
వేణురవంబువాడు – మ
మ్మంగజు పువ్వుదూపులకు నగ్గముచేసి
లవంగ లుంగ నా
రంగములార ! మీకడకు రాడుకదా !
కృప నున్నజూపరే !

మారు మాటాడజాలని ప్రాణుమాకులకు మరీ మరీ చెప్పుకొన్నారు.

మానినీ మన్మథు మాధవు గానరే !
సలలి తోదార వత్సకము లార !
సలలి తోదార వత్సకవైరి గానరే !
సుందరోన్నతలతార్జునములార !
సుందరోన్నతలతార్జున భంజు గానరే !
ఘనతర లస దశోకంబులార !
ఘనతర లస దశోకస్ఫూర్తి గానరే
నవ్యరుచిర కాంచనంబులార !
నవ్యరుచిర కాంచన కిరీటు గానరే
గహన పదవి కురవకంబులార !
గహన పదవి కురవకనివాసి గానరే !
గణికలార ! చారుగణికలార !

ఇలా గోపికలు మాధవునికొరకై ఏ పువ్వునూ విడిచిపెట్టకుండగ అడిగారు. గణికలను చారుగణికలను కూడ వేడుకొన్నారు. బ్రతిమలాడుకొన్నారు.

ఇలా యమునవీ తీర భూములన్నీ వెతుకుతుంటే దూరదూరంగా తళుకు తళుక్కున కనిపించి కనుమరుగ

న్నాడు గోపాలదేవుడు. అపుడు గోపికలంటారు ా -

అదె నంద నందనుం డంతర్హితుండ య్యె
పాటలీ తరులార ! పట్టరమ్మ !
హేలా వతుల "కృష్ణ" ! ఏల పానితి వని
ఐతేయ లతలార ! అడుగరమ్మ !
వనజాక్షు డిచటికి వచ్చి దాగడు గదా !
చూతిమంజరులార ! చూపరమ్మ !
మానినీ మదనుతో మారక యెరిగించి
మాధవీ లతలార ! మనుపరమ్మ !
జాతి సతుల బాయ నీతియే హరి కని
జాతులార ! దిశల జాటరమ్మ !
కదళులార ! పోయి కదలించి శిక్షింపన
జూటు దెచ్చి కరుణ జూపరమ్మ !

భగవంతుని అన్వేషణతో భక్తులకు ఇంత వ్యాకులత ండాలి.

శ్రీకృష్ణ దేవుడు గోపికల భక్తికి పులకించి ఇలా న్నాడు. "గోపికలారా ! మీరు నా కొరకు ంసార బంధాలు త్రెంచుకొన్నారు. నన్నే నమ్ముకొని న్నే ప్రాణాధికంగా కొలుస్తున్నారు. మీ మనస్సులు ధుపములంటని మల్లియలు. మీ కరములు పరమ ుకరములు. మీ చర్యలు పవిత్ర యోగిజన సంస్త ్యములు. మీది తపస్సు. మీ ప్రేమ మహస్సును ేవయుగాంతం వరకూ మరువను. దీనికి మూల్యం ెల్లించుకోలేను, మీ ఉదార ప్రేమకు బందీనైనాను. ానినుంచి ముక్తుణ్ణి కాలేను". ఇలా కృష్ణునిచేత నే స్తుతిపాత్రమైనది వారి భక్తి.

బ్రహ్మసూత్ర సారాంతంలో ఇలావుంది.

విముక్త సంగోను భజన్ భక్త్యా
తత్సమతా మగాత్ -

భక్తులు కూడా భగవంతుని వలెనే ప్రవర్తిస్తారు. భాగవతంలో గోపికల క్రీడలే ఇందుకు ప్రమాణాలు -

పూతననై ఒక్క పొలతి చరింపంగ
శౌరినై ఒక కాంత చన్నుగుడుచు
బాలునై ఒక భామ పాలకు నేడ్చుచో
బండినే నను లేమ బార దన్ను
సుడిగాలినని ఒక్క సుందరి గొనిపోవ
హరినని నర్తించు అబ్జముఖియు
బకుడనేనని ఒక్క పడతి సంరంభింప
పద్మాక్షుడను కొమ్మ పరిభవించు
ఎలమి రామకృష్ణ లింతు లిద్దరుగాగ
గోపవత్సగణము కొందరగుదు
రసురవైరిననుచు అబల ఒక్కతె చీరు
పసులమనెడి సతుల భరతముఖ్య !

ఇంతేకాక "తత్త్వమసి", "సోఽహమ్" అనే మహావాక్యాలకు కూడ భక్తులు ప్రమాణులు.

ఉద్దవునితో గోపికల భక్తినిగూర్చి కృష్ణపరమాత్మ ఇలా అన్నాడు.

"ఓ ఉద్ధవా ! గోపికలు ఉత్త అమాయికలు. భక్తికి మూలికలు, నా హృదయానికి ఏలికలు, నిశ్చల నిర్మల ప్రేమ దీపికలు.

ఆ అరవిందనయనలు ఆ అబ్జవదనలు తమ హృదయారవిందాలను నాకెప్పుడో అర్పించారు. నేను వారికి ప్రాణం. వారు శరీరస్మృతి లేకుండా నన్నే ధ్యానిస్తారు. ఆ సమాధ్యవస్థ యోగీశ్వరులకు కూడా అలభ్యం.

ఆ అబలలు ఆరోగ్యం సౌభాగ్యం లెక్కపెట్టకుండా కృశాంగులైపోయారు. నా పరమప్రేమలో పడి లౌకిక అనువంశిక ధర్మాధర్మాలు సుఖభోగాలు త్యజించారు.

నేను దూరంగా ఉన్నా ఏమీ ఇవ్వకపోయినా నిష్కామంగా నన్ను స్మరించి, వరించి, కీర్తించి, పరమ భక్తితో నర్తిస్తారు. ఆ నారీమణులు నాదర్శనం కోసం తపిస్తారు. నన్ను మురిపిస్తారు. అనుక్షణం నేను

వస్తానని వారిని చూస్తానని గంపెడంత ఆశతో కన్నులు కాయలు కాచేలాగా ఎదురు చూస్తుంటారు. నేను గోపికల ఆత్మను. వారు నా ఆత్మ.

కృష్ణదేవునికి ఆ కాంతలపై గల ప్రేమ, అనుగ్రహం, ఆదరం, ఆప్యాయతలు అనిర్వచనీయములు.

నాపై జిత్తము లెప్పుడున్ నిలుపుచున్
నా రాక కాంక్షించుచున్
నా పేరాత్మల నావహించుచు పగన్
నానా ప్రకారంబులన్
గోపాలంగన లెంత జాలివడిరో !
కోపించిరో ! దూరిరో !
ప్రేపల్లెన్ నిజధర్మ గేహములలో
విభ్రాంత చైతన్యలై !

కించిత్ జ్ఞాన గర్వంతో ఉన్న ఉద్ధవుడు కృష్ణ ప్రేరణతో ఆ కృష్ణప్రేమ మగ్నలైన గోపికలకు జ్ఞాన బోధ చేయటానికి ప్రేపల్లె వెళ్లాడు. అక్కడ కృష్ణ ప్రేమరసం నిండి ఉంది. ఉద్ధవుడు గోపాంగనామణులను దర్శించాడు- మణి సౌధాలను చూచాడు. వనాలను చూచాడు. భవనాలను చూచాడు. వనచరాలను చూచాడు పసీ భుజగాల్లను వనజాక్షులను చూచాడు. గోపులను చూచాడు. గోపాలురను చూచాడు. గోకులం అంతా చూచాడు.

అంతటా కృష్ణ గానం, కృష్ణ కీర్తన, కృష్ణస్మరణం కృష్ణ భక్తి. జ్ఞానం బోధిస్తానన్న ఉద్ధవునితో గోపికలిలా అన్నారు.

"ఉద్ధవా! మాకు జ్ఞానం తెలియదు. యోగం తెలియదు, భోగం తెలియదు. శాస్త్రం తెలియదు. వేదం నాదం తెలియదు. మాకు తెలిసిందల్లా కృష్ణ ప్రేమ, గోపాల లీల, గోవింద స్మరణ. అన్యం మాకవసరం లేదు. మా హృదయాలలో ఇతరానికి ఇసుమంతకూడా స్థానం లేదు. కన్నుల్ని తెరిచినా మూసినా కృష్ణరూపం కనిపిస్తుంది. మా దేవుడు మా కృష్ణుడు. వారితోనే మా జీవితం, మేము కృష్ణ పదారాధన మానుకొని క్షణం కూడా జీవించలేము. లోకులు కాకులు, కాకులు అరిస్తే కోకిలలు గానం మానుకుంటాయా ! ఎవరేమనుకుంటే మాకేమిలే కానీ మా హృదయ భాండాలనిండా కృష్ణ ప్రేమ రసం నిండినది. ఈ భాండాలు ఏ సాగరంలో ముంచినా వానిలోనికి అన్యం ఎలా ప్రవేశిస్తుంది. లౌకికాలు మాకు తెలియవు. ఆ దేవకీ పుత్రుడే ఆ కేకి పింఛకిరీటుడే మా సర్వస్వం గురువూ, దైవమూ, పతీ, గతీ అన్నీ ఆయనే.

ఆ శ్యామ సుందరాకారం, ఆ దివ్యసుందర వదనారవిందం, ఆగజరాజగమనం ఆ మధుర మృదు మంద హాసం, ఆ సుందరవిలాసం, ఆ రూపరసం-మాకెక్కడ లభిస్తాయి. మా కన్నులు ఆ కృష్ణ దేవుని తప్ప మరొక వస్తువును చూడవు. మా వీనులు ఆ కృష్ణకథలు తప్ప మరొక మాటను వినవు. మా మనస్సు మరొక దానిని మననం చేయదు.

ఉద్ధవా ! ఏ యోగం వద్దుగానీ, మాకు కృష్ణదేవుడు ప్రాప్తించే యోగం ఉందా ! మేము అబలలం, అమాయికలం, జ్ఞానం యోగం మాకేమి తెలుసు. కృష్ణుడు లేనిచోటు చూచి అక్కడ నీ బోధ మొదలు పెట్టు

మాధవునితో చెప్పు. మానినీ మణులకు వక్షాలపై చందనం పూసుకొన్నా, మౌక్తిక హారాలు వేసుకొన్నా విరహాగ్నికి అవి భస్మం అవుతాయి అని ఆ నందనందనుతో మా మాటగా అను."

---

Affection is the broadest
basis of good life.
– George Eliot

మంచి 'జీవితానికి'
'మమకారమె'
మంచి 'పునాది'

— జంగా గోపాల్

# భక్త కవి తులసీదాసు

జ్యోతిషం పట్ల గట్టి నమ్మకం కలవాడు ఆత్మారాం. అంతకుముందే తన భార్య మగబిడ్డను ప్రసవించిందన్న వార్త విన్నాడు. శిశువు జననకాలం మంచిది కాదనుకున్నాడు. తల్లిదండ్రులకు గండం వుందని, ఆ బిడ్డను దూరంగా వదలివేయమని భార్యకు చెబుతాడు. తల్లిప్రేమ ఆ దురాగతానికి అడ్డు తగులుతుంది. కాని చండశాసనుడైన భర్త ఆదేశాన్ని మన్నించక తప్పలేదామెకు. తన ఇంట్లో పనికత్తెగా వున్న మునియాకు బిడ్డను అప్పగించి, పెంచమని

జానమద్ది హనుమచ్ఛా

కోరుతుంది. మునియా భర్తకూడా బిడ్డను దూరంగా వదలివేయమంటాడు. గత్యంతరం లేక మునియా సమీప గ్రామంలోని ఒక బిచ్చకత్తెకు బిడ్డను అప్పగిస్తుంది. ఆ బిచ్చగత్తె పెంచిన పసిపాప నోట వెడలిన మొదటి మాట "రామ్". అందువల్ల ఆ పాపను "బోలా రామ్" అని పిలువసాగారు. కొందరు "రామ్ బోలా" అనేవారు. అనాధగా పెరిగిన ఆ బాలుడే తర్వాత భక్తకవి తులసీదాసు.

బిచ్చగత్తె కుమారుడని ఆ బాలుణ్ణి తోటి పిల్లలు ఎగతాళి చేసేవారు. పెంచిన బిచ్చగత్తె మరణించింది. అలా తిరుగుతూ మూడేళ్ళ రామ్‌బోలా ఒక దేవాలయం ముందు పడుకున్నాడు. వేకువనే నదీస్నానానికి వెళ్తున్న స్వామి నరహరిదాసు, ఆ పిల్లవాణ్ణి తన కుటీరానికి తీసుకునివెళ్తాడు. ఉపనయనం జరిపిస్తాడు. నరహరిదాసుతో పాటు రామాలయం వెళ్తాడా బాలుడు. శ్రీరామచంద్రమూర్తి విగ్రహం ముందు భక్తిశ్రద్ధలతో సాష్టాంగ నమస్కారం చేస్తాడు. శ్రీరామ విగ్రహంపై వున్న తులసీదళాలు "రామ్‌బోలా" తలపై పడతాయి. బోలారామ్‌ను ఆశీర్వదిస్తూ నరహరిదాసు "తులసీదాసు" గా నామకరణం చేస్తాడు. నరహరిదాసుల అంతేవాసిగ తులసీదాసు కొంతకాలం విద్యాభ్యాసం చేస్తాడు. తర్వాత శేష సనాతన అను పండితులవద్ద వేదశాస్త్రాలను అధ్యయనం చేశాడు. గురువుగారైన శేషసనాతుల ఆదేశం మేరకు తన స్వగ్రామం చేరుతాడు తులసీదాసు. తులసీదాసు పాండిత్యానికి ముగ్ధుడైన పండిట్ దీనబంధు పాఠక్ విద్యావతియైన తన కూతురునిచ్చి తులసీదాసును అల్లునిగా గౌరవిస్తాడు.

అప్పటివరకు ప్రేమానుభవం లేని తులసీదాసు, రూపవతియైన భార్య రత్నావళితో వుంటూ, ఎల్లప్పుడూ ఆమె వెంటే వుండిపోయాడు. ఒకమారు భర్త ఇంట్లో లేనివేళ ఆమె పుట్టినింటికి వెళ్ళిపోతుంది. తులసీదాసు ఇంటికి తిరిగి వచ్చేసరికి భార్య పుట్టినింటికి వెళ్ళిన వార్త వింటాడు. కుంభ వృష్టి వున్నా లెక్కసేయక భార్యను వెతుక్కొంటూ పరుగుతీశాడు. మామగారి ఇంటి ముఖద్వారం మూసివుంది. చిమ్మచీకటి ఆవరించిన ఆ నిశిరాత్రిలో ఇంటి పెరటిగోడ దూకి "రత్నావళీ, రత్నావళీ" అంటూ కేకలు చేశాడు. భార్య తలుపు తీసి భర్తను లోపలికి రమ్మన్నది. విద్యావతియైన రత్నావళి భర్తను అనునయిస్తూ సకల విద్యాప్రవీణులైన తాము నాపట్ల చూపుతున్న ప్రేమానురాగాలను శ్రీరామచంద్రుని పట్ల మళ్ళించటం శ్రేయోదాయకం కదా? అన్నది. తులసీదాసు మనసులో ఆ మాటలు గాఢంగా నాటుకున్నాయి. వెంటనే ఆమెతో సెలవు తీసుకుని తీర్థయాత్రలు చేశాడు. అలా పర్యటిస్తూ చిత్రకూటంలో ధ్యానమగ్నుడయ్యాడు. సీతారామలక్ష్మణులు ప్రత్యక్షమయ్యారు. తులసీదాసు సాగించిన సాధన సిద్ధి పొందింది. రామకథను గానం చేస్తూ సంచార-

సాగించాడు. విక్రమ సంవత్సరం 1631 లో 'రామ చరిత మానస్' రచన ప్రారంభించాడు తులసీదాసు. సంస్కృత భాషలో కాక సామాన్య ప్రజల భాష అయిన 'అవధీ' భాషలో తులసీదాసు రామకథాగానాన్ని విన్న ప్రజలు తన్మయులయ్యారు. తులసీదాసు కావ్య గానానికి ఛందోవతంణాలుగా ఏర్చేవాడు. ఆయన జనప్రియత్వంతో పండితులు అసూయాగ్రస్తులయ్యారు. తులసీదాసు, రామచరిత మానస్‌ను తప్పులతడిక అన్నారు. చివరకు పండిత సభ తులసీదాసు రామాయణాన్ని నిషేధించమని అక్బర్ చక్రవర్తికి విన్నవించుకుంటారు. అక్బర్ చక్రవర్తి ఆస్థాన కవి అబ్దుల్ రహీంఖాన్ రామచరిత మానస్‌ను అమూలాగ్రంగా చదివి ముస్లిమ్‌లకు ఖురాన్ ఎంత పూజనీయమో, అంతే గొప్పగా హిందువులు పఠించదగిన గ్రంథం తులసీదాసు "రామచరిత మానస్" అంటూ ప్రకటన చేశాడు. అక్బర్ చక్రవర్తి తులసీదాసును తమ దర్బారుకు రావలసినదిగ ఆహ్వానం పంపిస్తాడు.

"నేను రామపాద సేవకుడను. రామసామ్రాజ్యాన్ని ఆశిస్తున్నవాడిని. తమ భక్తిశ్రద్ధలకు సంతోషం. కాని తమ ఆహ్వానాన్ని మన్నించ వీలుకాదు" అని చెప్పి పంపిస్తాడు తులసీదాసు.

తులసీదాసు రామ కథాగానం చేస్తూ తన స్వగ్రామం చేరుతాడు. గ్రామ ప్రజల్లో ప్లేగువ్యాధి ప్రబలటంతో గ్రామం వదలి వెళ్ళుటకు నిశ్చయించుకుని తులసీదాసు వద్దకు వెళ్తారు. ప్లేగు వ్యాధిగ్రస్తుల సేవలో నిమగ్నులైన తులసీదాసు, ఆంజనేయస్వామిని అనుగ్రహింప ప్రార్థిస్తారు. రెండు రోజుల్లో వ్యాధి తగ్గింది. గ్రామం వదలి వెళ్ళినవారందరూ తిరిగి స్వస్థలం చేరుకుంటారు.

తులసీదాసు తమ పర్యటనను మరలా ప్రారంభించి వారణాసి క్షేత్రం చేరి కొంతకాలం "రామచరిత మానస్" గానం చేస్తారు ప్రతినిత్యం వేలాది భక్తులు కావ్యగానం వినేవారు. కాలాన్ని ఎవరూ జయించలేరు. తులసీదాసు వృద్ధులయ్యారు. చివరిగా "రామ్, రామ్, రామ్" అంటూ శ్రీరామ సాయుజ్యాన్ని చేరాడు భక్త కవి తులసీదాసు. తులసీదాసు దివంగతులైన స్థలం నేటికీ "తులసీ ఘాట్"గా భక్తుల దర్శనీయ క్షేత్రంగా వుంది.

## వింతలు - విడ్డూరాలు

* 1804వ సం॥లో నెపోలియన్ ఇటలీ సరిహద్దుల్లో ఉన్న "స్విస్" గ్రామాన్ని ఆక్రమించి గ్రామస్తులతో వెట్టిచాకిరీ చేయించుకోవడమే కాకుండా ఆయన సైన్యం గ్రామంమీద పడి తెగ తినేశారట. పైపెచ్చు చెట్లను నరికించాడట, అదేంటని అడిగితే నష్టపరిహారం ఇస్తానని ఎగ్గొట్టిపోయాడట. ఈమధ్య పాత రికార్డులు తిరగవేసిన ఆ గ్రామాధికారి ఫ్రాన్స్‌వారిని ఆ సొమ్ము చెల్లించమని అర్జీ పెట్టుకున్నాడట. అది ఆ రోజుల్లో పదివేల డాలర్లట. ఇప్పుడది సుమారుగా ఐదు కోట్ల డాలర్లు ఉంటుందని అంచనా ! అదే మరి ఋణానుబంధం !

* కోయంబత్తూరు సమీపంలో ఆనకట్టైలో ఇరుల్లా గిరిజన జాతికి చెందిన ఓ వ్యక్తి కరువుపరిస్థితికి తట్టుకోలేక తానా 12 ఇడ్లీల అప్పు ఉన్న వ్యక్తికి తన ఎకరం పొలం ఇచ్చేశాడు. తన 5 ఎకరాల పొలాన్ని వంద రూపాయలకు అమ్మి గ్రామాన్ని విడిచిపోయాడు.

* డాక్టర్ జాన్‌సన్ పార్కులో తిరుగుతూ పద్యాలు రాసేవాడట. ఇల్లూ-వాకిలి లేని "డేవేజ్" అనే నాటకకర్త తన నాటకాలలో డైలాగ్‌లు వీధిలో నడుస్తూ రాసేవాడు. "వర్డ్స్‌వర్త్" కి ఉద్యానవనంలోకి వెళ్ళి కూర్చుంటేనే కాని కలం కదిలేది కాదు.

# ప్ర ... న

నీవెవ్వరినైనా రక్షించలేవు గాండీవము మాధవున కివ్వు అన్నాడు ఆగ్రహావేశపరుడయిన యుధిష్ఠిరుడు తీక్ష్ణ దృక్కులు పార్థునివైపు సారించి.

అన్న దిశ, సోదరుల దిశ చూచినాడు విజయుడు. నా శపథము ప్రకారము ఈతని ఈ గాండీవమున శరము సంధించి చంపవలె. ఏమందువు? అని ప్రశ్నించినాడు పార్థుడు మాధవుని.

కావిలిపాటి విజయలక్ష్మి

ఏమున్నది? అని ముఖమున చిరునవ్వు మొలకెత్త ఆతనివలన మీరు పడిన ఇడుములతో నిందించి తూలనాడుము. అతనిని చంపినట్లగును అనినాడు కృష్ణుడు.

ఆనాడు ద్రోణుని సర్వసేనాధిపత్యమున జరుగు సమరమున

కర్ణునిచేత చిక్కినాడు ధర్మజుడు. వడలు రక్తసిక్తమయినది. నాసిక చితికినది, విలవిలలాడు యుధిష్ఠిరుని గేలిచేసి నవ్వి వదలినాడు కర్ణుడు.

దేహము నొచ్చి, నాసి పుటాల రక్తము చిమ్మ అతని నవ్వు హృదయమును శరమై చీల్చ కుపితుడై శిబిరమునకు మరలిన యుధిష్ఠిరుడు తమ్ముల తూలనాడినాడు.

నీ జూద వ్యసనము వలన కదా! మేమీ అడవుల పాలయి మధుర మృష్టాన్నములకు దూరమయితిమి. ద్రౌపది ఘోర పరాభవ మందినది. మీకు బిడియము లేదా! తమ్ముల నిందించుటకు. మా శక్తి సమర్థతలు, వీర పరాక్రమములు మా శస్త్రాస్త్ర విద్యా ప్రవీణత అన్నియూ పెట్టెను పెట్టి మూసిన సర్పము వలె బుస కొట్టి అణగియున్నవి. నీ జూద వ్యసనము మాకు శాపమైనది. మమ్ము మారుటకు మీ నాలుక, గొంతు అని అలసినట్లు ఆగి బావా అగ్రజుని, అజాతశత్రుని, అన్నని, అగ్రజుడు తండ్రితో సమానమందురు. అతనిని తూలనాడిన నాకు ప్రాయశ్చిత్తము లేదు. మరణమే శిక్ష అని ఆత్మహత్యకు సిద్ధమయినాడు ఫల్గుణుడు.

ఎత్తిన అతని చేతిని పట్టి - ఆగుము, నీ విజయములు, పరాక్రమము అతిరథుడుగా అందరికన్నా మిన్న నేనే అనియు స్వర్గమున ఇంద్రుని సరసన గడుపుట, పశుపతి పాశుపతాస్త్రము నిచ్చుట నీ గొప్పతనము. అందరు, అతడు వినునట్లు చెప్పుము. అది ఆత్మహత్యా సదృశమగును అనినాడు, అన్నియూ ఎఱిగిన ఆ చక్రధారి.

అర్జునుని ప్రతిన వినినంతనే ఖిన్నుడయిన యుధిష్ఠిరుడు. పెద్ద ఆపద తప్పినవానివలె పెన్నిధి కోల్పోయి తిరిగి లభ్యమయినవానివలె ఆనందాశ్రువులు రాల్చినాడు. దీర్ఘముగా నిట్టూర్పు వదలినాడు. నీటి తెరలు కప్పిన కనులెత్తి తమ్ముని చూచినాడు. కృష్ణునికి కృతజ్ఞతాపూర్వకముగా మ్రొక్కినాడు.

భీమసేనుడు, నకులసహదేవులు సంతసించినారు.

అర్జునుడు తన గొప్పతనము, సాధించిన విజయములు చెప్పినాడు. తనను మించిన మేటి విలుకాడు లేడని గర్వముతో మీసము దువ్వి, అగ్రజుని పాదములకు సాష్టాంగ వందనము చేసినాడు.

ధర్మరాజు తమ్ముని కౌగలించి శిరము మూర్కొని ఆనందబాష్పములు రాల్చినాడు.

అందరి ముఖముల హాసరేఖలు విరిసినవి.

# ★ కళాతపస్వి బి. ఎన్. రెడ్డి ★

సినిమా అనేక లక్షల రూపాయల పెట్టుబడితో కూడిన వ్యాపారమే అయినప్పటికీ, తమ కళాహృదయాన్ని ఆవిష్కరించే సాధనంగా సినిమాను భావించిన సంస్థలూ దర్శకులు మనకు మొదటినుంచి వున్నారు. కలకత్తాలో న్యూ థియేటర్స్, పూనాలో ప్రభవా సంస్థల వంటిదే మద్రాస్‌లోని వాహినీ సంస్థ-దాని ఊపిరీ వెన్నెముక బి. ఎన్. రెడ్డిగారు. విద్యాభ్యాసం అయిన తర్వాత ఆడిట్ కంపెనీలో ఉద్యోగానికి చేరినా, "ఆదాయం ఖర్చుల" తికమక లెక్కలు ఆయనకు వంట బట్టక సినిమారంగంలోకి ప్రవేశించారు. తెలుగు చలన చిత్ర పితామహుడు హెచ్. ఎం. రెడ్డిగారి వాహినీ సంస్థలో కలసి కొన్నాళ్లు పనిచేసినా అందులో ఇమడలేక కొందరు మిత్రుల ప్రోత్సాహ సహకారములతో వాహినీ సంస్థను బి. ఎన్. రెడ్డిగారు ఏర్పాటు చేశారు. ఆ సంస్థకు ఆయనే వూపిరీ, వెన్నెముక.

తెలుగు చలనచిత్ర చరిత్రలో, దక్షిణ భారత చలన చిత్ర చరిత్రలో వాహినీ సంస్థ ఆవిర్భావాన్ని స్వర్ణ ఘట్టంగా పేర్కొనవచ్చు. ఈ సంస్థ 3 దశాబ్దాల తన జీవితకాలంలో పదమూడు చిత్రాలు మాత్రమే దీసింది. అంటే సగటున రెండేళ్ళకి ఒక చిత్రంకూడా లేదన్న మాట. ఐనా ఆ చిత్రాలన్నీ ఆణిముత్యాలు, వాహినీ సంస్థ నిర్మించిన చిత్రాలు సాంఘికమైనా, జానపదమైనా చారిత్రికమైనా వాటిపై ఆ సంస్థ ముద్ర బలంగా వుండేది.

వీటిలో బి. ఎన్. రెడ్డిగారు దర్శకత్వం వహించిన చిత్రాలు తొమ్మిది కాగా నాలుగింటికి కె. వి. రెడ్డిగారు దర్శకత్వం వహించారు. వీరి గురించి మరోసారి ప్రస్తావించుకుందాం. ఈ తొమ్మిది కాక బి. ఎన్. రెడ్డిగారు బయటి సంస్థల రెండు చిత్రాలకు దర్శకత్వం వహించారు. ముప్ఫయేళ్ళ కాలంలో ఆయన కేవలం పదకొండు చిత్రాలకు మాత్రమే దర్శకత్వం వహించారు. అంటే మూడేళ్ళకు ఒక చిత్రమన్నమాట. ఏడాదికి నాలుగు అయిదు చిత్రాలు చొప్పున తీసేస్తున్న మన దర్శకమహాశయులతో పోలిస్తే బి. ఎన్. రెడ్డిగారు తీసిన చిత్రాల సంఖ్య ఎంత స్వల్పమో అర్థమవుతుంది. ఐతే బి. ఎన్. రెడ్డిగారు తీసిన చిత్రాలన్నీ వందేమాతరం నుంచి బంగారు పంజరం వరకు ప్రతి చిత్రం చిర స్మరణీయమైనదే.

## కంచి వాసుదేవరావు

బి. ఎన్. రెడ్డిగారు అనగానే మనకు తప్పక గుర్తుకు వచ్చేది మల్లీశ్వరి. హిందూ వంటి పత్రిక దాన్ని "సెల్యూలాయిడ్ క్లినిక్"గా ప్రశంసించింది. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిచేత మొదటిసారి మాటలు, పాటలు రాయించారు. ఆ చిత్రానికి ఆయన ఎంతటి మరపురాని మధురగీతాలు రాశారో అందరికీ తెలుసు. కృష్ణశాస్త్రి గారి పాటలు దానికి రాజేశ్వరరావు సమకూర్చిన బాణీలు, వాటికి ఒళ్లు పులకరింపచేసేట్టు భానుమతి, ఘంటశాలలు పాడిన విధం ఈనాటికీ, ఏనాటికీ మరచి పోలేని రసగుళికలు. మల్లీశ్వరి విడుదలై దాదాపు నలభయి సంవత్సరాలు కావస్తున్నా సాహిత్యంలోను, స్వరకల్పనలోను శ్రావ్యతలోను ఆ స్థాయికి చేరుకున్న పాటలు బహు కొద్ది.

బి. ఎన్. రెడ్డిగారిది కవితా హృదయం అందువల్లనే ఆయన దర్శకత్వం వహించిన ప్రతి చిత్రంలోనూ పాటలు సాహిత్య విలువ కలిగివుంటాయి. వాటికితగ్గ

సంగీతం వుంటుంది. అందువల్లనే అవి అజామరత్వం కలిగివుంటాయి. మల్లీశ్వరి పాటలు అటుంచితే స్వర్గసీమలో "ఓహో పావురమా", బంగారుపాపలో "కన్న దేవకిని కన్నీరే మిగిలె", భాగ్యరేఖలో "నీవు వుండేది ఆ కొండపై?" పూజాఫలంలో "పగలే వెన్నెల", రాజమకుటంలో "సడిచేయకే గాలి" వంటి పాటలు ఎన్నిటి నయినా పేర్కొనవచ్చును.

బి.ఎన్. రెడ్డిగారి కళాహృదయానికి ఒక ఉదాహరణ. వితంతు పునర్ వివాహ సమస్యపై ఆయన సుమంగళిని కళాత్మకంగా తీర్చిదిద్దారు. దాదాపు ఇదే సమయంలో ఇదే సమస్యపై వై. వి. రావుగారు మళ్ళీ పెళ్ళి ని వ్యాపారదృక్పథంతో తీసారు. మళ్ళీ పెళ్ళి అఖండ విజయం సాధించగా సుమంగళి ఆర్థికంగా దెబ్బతింది. సుమంగళికి మరో ప్రత్యేకత వుంది. అప్పటి గ్లామర్ హీరో అయిన నాగయ్య చేత వృద్ధ వేషం వేయించారు. ఆ పాత్రలో నాగయ్య జీవించాడు. దాంతో నాగయ్య గారు గ్లామరస్ హీరో మాత్రమే కాదు, క్యారెక్టర్ ఏక్టర్‌గా ముద్ర వేయించుకున్నారు. ఈ స్ఫూర్తితోనే నాగయ్య ఆ తర్వాత కె. వి. రెడ్డిగారి దర్శకత్వంలో తయారైన భక్తపోతన, యోగి వేమన చిత్రాలలో నభూతో నభవిష్యతి అన్నట్లు నటించారు. ఈ చిత్రం లోని పాటలు "పసుపు కుంకుమదల నీ జన్మహక్కు కాదా", "వస్తాడే మా బావ" పాటలు ఆనాడు ఆంధ్ర దేశమంతా మార్మోగిపోతాయి.

బి.ఎన్. రెడ్డిగారి సినిమాలలో నటించడం మహద్భాగ్యంగా తమ నట జీవితంలో ఒక మలుపుగా ఆనాటి నటులు భావించేవారు. స్వర్గసీమ చిత్రం భానుమతి సినిమా జీవితాన్ని ఒక మలుపు త్రిప్పింది. ఆ చిత్రం ఆమెని ఎవర్ హీరోయిన్‌గా నిలబెట్టింది. ఆ తర్వాత మల్లీశ్వరి చిత్రం ఆమె నటజీవితంలో మరపురాని ఘట్టం. మల్లీశ్వరి చిత్రానికి సంగీతం సమకూర్చిన రాజేశ్వరరావు ఒకసారి ఆకాశవాణి కేంద్రం నుంచి మాట్లాడుతూ ఏ అమృత ఘడియలో మల్లీశ్వరి పాటలను స్వరకల్పన చేశానో కాని అవి అజామరమ శాశ్వతకీర్తిని సమకూర్చిపెట్టాయని అన్నారు.

తను తీసిన అన్ని చిత్రాల్లో బంగారుపాప తనకు ఎక్కువ సంతృప్తి ఇచ్చినట్లు బి. ఎన్. రెడ్డిగారు భావించేవారు. ఐతే ఆ చిత్రం ఆర్థికంగా దెబ్బ తింది. ఆర్థికంగా దెబ్బ తిన్నప్పటికీ ఎస్. వి. రంగారావు వైవిధ్య నటన - చిత్రం మొదటి భాగంలో పరమ రౌద్రమూర్తిగా - తర్వాత పరమ శాంతమూర్తిగా పరివర్తనం చెందిన ఘట్టాలలో ఆయన నటన రంగారావుకు ఎనలేని కీర్తి తెచ్చిపెట్టింది. బంగారుపాప చిత్రంద్వారా ఆయన ప్రసిద్ధ కథా రచయిత పాలగుమ్మి పద్మరాజుగారిని సినిమారంగానికి తెచ్చారు.

బంగారు పాప చిత్రాన్ని చూచి ముగ్ధుడైన ప్రముఖ బెంగాలీ దర్శకుడు దేవకీబోసు ఈ చిత్రాన్ని బెంగాలీలో తీసారంటే ఆ చిత్రం ఆయనను ఎంతగా ఆకర్షించిందో అర్థం చేసుకోవచ్చు. బి. ఎన్. రెడ్డిగారు దేవకీబోస్‌ను తన గురుతుల్యునిగా భావించుకునేవారు. తాను బెంగాలిలో తీసిన సీత చిత్రం (లవ కుశుల కథ) రెడ్డిగారిని అమితంగా ఆకర్షించింది. తెలుగులో ఆ చిత్రాన్ని తీయాలనుకున్నారుకాని ఆ కోరిక నెరవేరలేదు. కాని ఆ దేవకీబోసే తను తీసిన చిత్రాన్ని బెంగాలీలో తీయడంకన్నా రెడ్డికి గర్వకారణం ఏముంటుంది?

కళాత్మకమైన సాంఘిక చిత్రాలకు దర్శకత్వం వహిస్తున్న బి. ఎన్. రెడ్డిగారు తొలిసారి జానపద చిత్రం రాజమకుటానికి దర్శకత్వం వహిస్తూ వుంటే స్పోర్ట్స్ అండ్ పాస్ట్ టైమ్ (హిందూ అనుబంధపత్రిక) "ఏమిటిసార్ మీరు థర్డు క్లాసులో ప్రయాణం చేస్తున్నా" రని చమత్కరించారు. దానికి రెడ్డిగారు జవాబుగా అవును "శుభ్రముగా పొందికగా వుండే థర్డు క్లాస్ కంపార్టుమెంటులో ప్రయాణం చేస్తున్నాను"అన్నారుట. రాజమకుటం జానపద చిత్రమైనా అది రెడ్డిగారి ముద్ర నుంచి తప్పించుకోలేకపోయింది ఆ చిత్రంలో సంగీత

( తరువాయి 24వ పేజీలో )



# మందు భాగ్యాలు



( గత సంచిక తరువాయి )

## నిజం కక్కిస్తా

"ఏరా ! మర్యాదగా నిజం చెప్తావా? మక్కెలు విరగతన్నమంటావా?" అంటూ వోర చూపులతో, వాడి మాటలతో నేరస్థుల్ని స్టేషనులో నిలబెట్టి బెదిరించడం పోలీసులకు పరిపాటే !

"అలా ఎందుకు చెప్తాడు సార్ ! నిజం ! నాల్గు దెబ్బలు తగలాల్సిందే !" అంటూ దెబ్బ కనపడకుండా ఎముకలు కుళ్ళబొడిచే ప్రత్యేకమైన కళ కొంతమంది పోలీసులకు వెన్నతో పెట్టిన విద్య !

అయితే యిదంతా పాశవిక పద్ధతి! ఆటవిక పద్ధతి! దీనివల్ల చాలా యిబ్బందులొచ్చి పడుతున్నాయి. ఒక్కొక్కప్పుడు ఆ నేరస్తుడు ఒక్క దెబ్బకే తామని ప్రాణం వదిలేస్తున్నాడు ! దాంతో మరింత గందర గోళం ! అందుకని ఈమధ్య వాళ్ళకే ఓ కొత్త అయిడియా వచ్చిందట !

"అలాక్కాదు సార్ ! లాఠీదెబ్బకన్నా గురుడికి మందు కొట్టిస్తే దెబ్బకు నిజం కక్కేస్తాడు ! మందు కొటినవాడి నోటో చపే నిజం దాగదు సార్ !" అనే ఐజులు వచ్చేశాయి !

అదిగో ద్వారక – ఆలమంద "లవిగో–కురుక్షేత్రం గాని, శ్రీకృష్ణరాయబారం గాని, ఎక్కడ ప్రదర్శించినా హాలు దద్దరిల్లేలా ఆడియన్సు వన్సుమోరనేలా గొంతెత్తి అదిగో ద్వారక ఆలమంద లవిగో" అంటూ రాగం తీయడం మనందరం ఎరుగున్నదే ! అయితే ఈ ఆలమందలిప్పుడు – ఆల"మందు"లుగా మారిపోతు న్నాయి. మందు కొట్టే మహదవకాశం, మహద్భాగ్యం మానవజాతి కొక్కరికేనా – మాకేం తక్కువ? మేం మాత్రం మందు పుచ్చుకోకూడదా అని అనుకున్నట్లు న్నాయి ఆ ఆవులు !

అసలింతకూ ఏం జరిగిందంటే – జోధ్‌పూర్‌లో మత్రాసా పంచాయితీ సమితిలోని ఓ పొలంలో పాపం పెద్దమనుషులు కొందరు మందుంచిన భాండాలను భూగర్భంలో పాతి దాచుకున్నారు. అవసరం కల్గి నప్పుడు అక్కరకొస్తుందనో, అందరి కంటా పడకుండ ఉంటుందనో అలా దాచేశారు. పరమ పవిత్రమైన పశువుల్లో ఓ గోవు అ పొలంలో పచ్చని పచ్చికను




మేస్తూండగా, ఆ పాత్రల్లోని మందు సన పసిగట్టి పరుగు పరుగున పోయి ఆ పాత్రపై మట్టిని నెట్టేసి – పాత్రలోని మందును–[మధురమైన మధువు అందామా?], గడగడా తాగింది ! దాంతో ఆ ఆవుకు ఎక్కడా లేని ఆవేశం, ఆనందం, ఉద్రేకం, ఉత్సాహం కలగడంతో మరిన్ని పాత్రల కోసం వెతకనారంభించింది. మనలా స్వార్థం, సంకుచితం గూడు కట్టుకొన్న ప్రాణం కాదు కాబట్టి ఆ ఆవు తన మూతిని తక్కిన గోవులకు వాసన చూపెట్టింది ! ఇంకేముంది ! ఆవులన్నీ మందలు మందలుగా పరుగు పరుగున వచ్చేసి ఆలమందలయి, ఆ పాత్రల లోని మందును కడుపారా హాయిగా ఆస్వాదం చేసి ఆనందంతో గంతులేయగా, ఈ వింత కనుగొన్న మనవాళ్ళు అంటే మానవోత్తములు ఆ గోవులను

తరిమేసి తతిమ్మా కార్యక్రమాన్ని వాళ్ళు పూర్తి చేశారు ! అదీ సంగతి !

## మందు చిలకలు

రామచిలుకలున్నాయి - సీతాకోకచిలుకలున్నాయి - పిల్లలు తినేందుకు పంచదార చిలకలున్నాయి. కాని యీ " మందు " చిలకలు ఏమిటి ? యెక్కడుంటాయి? అని అనుకుంటున్నారా ? వస్తున్నా !... వస్తున్నా !... ఆ విషయమే చెప్తా !

అమెరికాలో ఓ పెద్దమనిషికి పక్షులంటే పంచ ప్రాణాలు ! పరమ ప్రీతి ! అందులో చిలకలంటే అమితప్రేమ. పంజరంలో పెట్టిన చిలకలకు పంచ భక్ష్య పరమాన్నంలాంటి ఆహారం పెట్టడంతో సంతృప్తి చెందని ఆ మహానుభావుడు- ప్రతిరోజూ తన పెంపుడు చిలకలకు తనతోపాటే ఓ పెగ్గు విస్కీలాంటిది అలవాటు చేశాడు. అనుకోకుండా అందుకున్న యీ మందుతో మత్తెక్కిన ఆ చిలకమ్మలు అందంగా, మందంగా మత్తు మత్తుగా, ముద్దుముద్దుగా, ముద్దముద్దగా అడ్డమైన కూతలు కూయసాగాయి. రానురాను మరింత ముదురుపాకంలో చిలకల పలుకులు వినిపిస్తుంటే విసుగెత్తి ఆఖరకు ఆ మానవుడు వాటికి మందు ఆపుచేశాడు. అసలంటూ అలవాటు చేయకుండానే వుండాలిగాని అలవాటుపడ్డ ప్రాణానికి మందు లేకుండా బంద్ చేస్తావా. యిక నీకూ మాకూ సంబంధం లేదు. ఇక మా సంగతి నీకెందుకు అంటూ అందాల చిలకలు పంజరపు బంధనాలు తెంచు కొని పారిపోయాయిట. ఆరో ప్రాణం పోయినంతగా ఆ పెద్దమనిషి హైరానాపడిపోతూ నా పెంపుడు చిలక లను కనీసం ఒక్కదాన్నైనా పట్టిస్తే పది పదుల పౌండ్లు పారితోషికం అంటూ ప్రకటించాడు. యింటికొచ్చి " ఎంతపని చేస్తివే మందూ ? " అంటూ అందంగా ఏడుస్తూ కూర్చున్నాడు. ఏంటి ? ఆ చిలకల కోసం ట్రై చేస్తామంటారా ? చేయండి ! బెస్టాఫ్ లక్.

దీన్నిబట్టి మనకేం తెలుస్తోందంటే ఈ మందుకు దాసులైన వాళ్ళు మనుష్యులేగాదు, పశుపక్ష్యాదులుకూడా. అందుకే ప్రపంచంలోని " మందు " భాగ్యులందరికీ హేట్సాఫ్.

( 22వ పేజీ తరువాయి )

## కళాతపస్వి బి. ఎన్. రెడ్డి

సాహిత్య ప్రమాణాలు ఉన్నతంగా ఉండడం చాటాయి. అందులో నటించిన గుమ్మడి, కన్నాంబ,రాజసులోచన, రామారావు ప్రభృతుల నటన పరాకాష్ఠకు చేరుకుంది.

బి.ఎన్. రెడ్డిగారు ఆఖరుగా దర్శకత్వం వహించిన చిత్రం బంగారు పంజరం. అది ఆర్థికంగా అపజయం పాలయింది. దాంతో విరక్తి చెందిన రెడ్డిగారు సినిమా రంగంనుంచి శాశ్వతంగా తప్పుకున్నారు. దక్షిణభారత చలనచిత్ర పరిశ్రమలో చరిత్ర సృష్టించిన వాహినీ సంస్థ అంతరించింది.

బి.ఎన్. రెడ్డిని భారత ప్రభుత్వం దాదాభాయిఫాల్కే అవార్డు ఇచ్చి పద్మభూషణ్‌తో సత్కరించింది. ఈ సత్కారాలు చంద్రునికి నూలుపోగుగానే భావించాలి.

బి. ఎన్. రెడ్డిగారు అందించిన కళాదీపం ఆరి పోకుండా కె. విశ్వనాథ్‌గారు ముందుకు తీసుకుపో తున్నారు. భావుకతలో వీరిద్దరికీ పోలికలు వున్నాయి. వీరిద్దరి చిత్రాలలోనూ సంగీత సాహిత్యాలకు పెద్ద పీట వుంటుంది. చలనచిత్ర పరిశ్రమ వ్యాపారమే ఏకైక ధ్యేయంగా వికృతస్థాయికి పతనమౌతున్న సమయంలో బి. ఎన్. రెడ్డి చూపిన మార్గంలో పయనిస్తున్న దర్శకులు కొందరైనా వుండటం కళాభిమానులకు సంతృప్తి కలిగించే విషయం. ✳

" త్యాగం చేయటం చేతనే తేజం ఆవిర్భవిస్తుంది. స్వార్థం ప్రవేశించిన మరుక్షణంలోనే తేజం ఆరిపో తుంది. మహావృక్షంగా మారడానికి మొదట భూమిలో తన శరీరమును నశింపజేస్తుంది. అల్లే స్వార్థం పరి త్యాగంచేతనే మనకు విజయం చేకూరుతుంది. "

— స్వామి రామతీర్థ

# భగవదాశ్రయము !

భయంకరమైన అడవిలో గర్భవతియైన లేడి తన రెండు పిల్లలతో తిరుగుచుండగా, వేటగాడు వేటకోసం పట్టిన వల ఒకటి కనిపించింది. అది చూచి వెనుకకు తిరిగిపోయే సమయమున వెనుకనుండి రెండు వేట కుక్కలు వస్తున్నాయి. ఎడమవైపు తిరుగుతే ఆహారం కోసం ఎలుగుబంటి మీదకు వస్తోంది. కుడివైపుకు పోదామనుకుంటే తోడేలొకటి మీదకు వస్తోంది. ఈ పరిస్థితి చూస్తే చాలా ప్రమాదకరంగా ఉంది. "భగవంతుడా! నీవే కాపాడాలి" అని అనుకొంటుండగానే సమీప దూరంలో వటవృక్షం మీద వేటగాడు ధనుస్సుకు అమ్ములు సంధించియున్నాడు. ఈలోగా అగ్నిజ్వాలలు అంటుకున్నాయి. ఆ జ్వాలల భయంకర ధ్వనులచే సింహం నిద్రలో నుండి లేచి భయంకరంగా అరచింది. ఆ అరుపులకు అరణ్యమంతా దల్లడిల్లింది. ఈ విపత్కర పరిస్థితికి లేడిపిల్లలు కూడ చాల భయపడినవి. ఆ కురంగం రెండు కళ్ల మూసుకొని మనసారా లక్ష్మీనారాయణుని స్మరించినది. భగవంతుని నమ్మి చెడినవారెవ్వరూ లేరు. ఆ సమయంలో వృక్షంపై వేటగాడిని కాలసర్పమొకటి కాటు వేయగా 'అబ్బా' అంటూ అతను చనిపోయాడు. అతని చేతిలో గల బాణము ఎగిరి తగిలి భల్లూకము చచ్చింది. తమ వేట వస్తువును తోడేల్లు వచ్చి పట్టుకుపోవుననే ఉద్దేశ్యముతో దానిని తరుముకుంటూ కుక్కలు అటు పోయినవి. ఈలోగా మంటలు వాయువేగంతో అరణ్యమెంతో తగులబడింది. అదే సమయంలో ఆకాశం మేఘములతో నిండి కుండపోతగా వర్షంకురిసి ప్రశాంత వాతావరణ మేర్పడింది. సంకల్ప మాత్రముచే ఈ భయంకర మారణహోమములు క్షణకాలంలో మాయమైన పరిస్థితి చూచి కురంగి అంతరంగం ఎంతగా ఉప్పొంగునో వర్ణించుటకు మానవమాత్రులకు సా కాదు. అపార కరుణా సముద్రుడైన భగవంలీలను స్మరించుకొని బిడ్డలతో సురక్షిత ప్రాంతము వెళ్ళింది కురంగి.

ఇది కేవలం కురంగిని ఉద్దేశించి వేదవ్యాసులవ చెప్పింది మాత్రమే కాదు. మానవమాత్రులైనవారు త జీవనయాత్రలో ఎప్పుడో ఒకప్పుడు అతిక్లిష్ట సమస్య నెదుర్కొనకతప్పదు. ఆ పరిస్థితులనుండి తేరుకొనుట దైవభక్తితో దైవానుగ్రహం పొందవలెనన్నదే ఈ కథ యొక్క లక్ష్యం.

సేకరణ : తాటికొండ తిరుపతయ్య

## అక్షర దీపం

యువకుల్లారా ! యువతుల్లారా !
రండి రండి రండి ముందుకు
అక్షర దీపం వెలిగించేటందుకు
అజ్ఞాన తిమిరం తొలగించునందుకు॥

చదువుకున్న మీ చదువు, సార్థక్యం చెందగాను
చదువురాని సాటిమనిషి, నుద్ధరింప నుద్యమింప॥
రెక్కాడను డొక్కాడదు, పేదప్రజల తీరికప్పుడు
చేరదీసి ఓనమాలు, దిద్దజేయు బుద్ధికొలుప॥
నూతిలోని కప్పలాటి, జీవికల్లె అణిగి మ ని
అభివృద్ధికి నోచుకోని, అభాగ్యుల నాదుకోను॥
బడుగువారి బ్రతుకుల్లో, వెలుగు లీన విజ్ఞానం
చదువ వ్రాయ నేర్పి వారి, జీవితాలు సంస్కరింప॥

- 'నవ్యకవి' నాదెళ్ళ

# కాపరగిరి

( గత సంచిక తరువాయి )

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 15-4-1976

ప్రియమైన జయ,

"ఏ దేశ వాఙ్మయమునైనను శ్రీరామ చంద్రుని వంటి పురుషోత్తములు లభించిన లభించవచ్చునేమోగాని, సీత వంటి యాదర్శ చరిత్రగల పతివ్రతాతిలకము లభించుటదుర్లభం" అని స్వామి వివేకానంద అంటారు. అందువల్లనే శ్రీమద్రామాయణ మహాకావ్యమందు వాల్మీకి సీతాదేవికి శ్రీరామునితో సమానమగు ప్రాధాన్యత యిచ్చాడు. అంతే కాదు ఈ మహాకావ్యమునకు "సీతాయాశ్చరితమ్" అని పేరుకూడా పెట్టాడు. ఆమె ఒక్క భారతనారీ లోకమునకే గాక యావత్ ప్రపంచ నారీలోకానికే ఆదర్శప్రాయురాలైంది. నిశ్చలమగు పతి భక్తి, పెద్దలయెడల గౌరవము, ధర్మనిష్ఠ, వినయ వివేక సౌశీల్యాదులు, కష్టములయందు అచలత్వము, అసాధారణ మగు క్షమ, కరుణ, నిర్మలప్రేమ, పవిత్రత మొదలగు సద్గుణములన్నియూ ఈమెలో ఇమిడి నిమిడీకృతమై వున్నదనుటలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. స్త్రీ యొక్క నడవడిక, సుగుణశీల సంపత్తులు ఏ విధంగా వుండాలో, తన జీవనగమనం ద్వారా చూపించిన మహాసాధ్వీమణి, పతివ్రతా శిరోమణి సీతాదేవి.

తండ్రి ఆజ్ఞానుసారం శ్రీరామచంద్రుడు అరణ్యానికి బయలుదేరేటప్పుడు తనను కూడా తీసుకొనివెళ్ళమని బతిమాలుకుంటుంది, ప్రాధేయపడుతుంది. శ్రీరామునితో "భర్త లేని స్వర్గసుఖములకంటే, భర్తతో అరణ్యవాస దుఃఖమునే వరింతును. నీతో నుండుటయే స్వర్గము. నీతో కలిసియున్నచో నా కదియే పరమ సుఖము. నిన్ను విడిచి వుండుటయే నాకు నరకము. కనుక నన్ను తీసుకొనిపొమ్ము" అని విలపిస్తూ వెంటబడుతుంది. మరియు "నన్ను ఐశ్వర్యముగాని, ధనముగాని లోభపెట్ట చాలవు. సూర్యుని విడిచి వెలుగు ఎట్లుండదో! నిన్ను విడిచి నేను అట్లుండలేను" అని అంటుంది. తనను వనవాసమునకు తీసుకొని వెళ్ళనియెడల విషము త్రాగియో, నీటిలో పడియో, అగ్నిలో దుమికియో మరణిస్తానని బెదరిస్తుంది. శ్రీరాముడికి తప్పనిసరి అవుతుంది. వనవాసానికి తనతోపాటు తీసుకొనివెళ్ళతాడు. సుఖములోనే కాక, దుఃఖములోకూడ పాలు పంచుకోవటం నిజమైన భారత నారీ ధర్మమని నిరూపించింది సీత. అరణ్యవాసమున ఎట్టి కష్టములు కలుగజేయనని, పత్ర, పుష్ప, ఫలాదు లలో ఏమి యిచ్చినప్పటికి దానినే అమృతప్రాయంగా స్వీకరించి, ఏ మాత్రం భారం లేకుండా అనుసరిస్తానని వాగ్దానం చేస్తుంది సీత శ్రీరామునికి. నిర్మలమైన ప్రేమ, నిష్కపట బుద్ధికి యివి నిదర్శనములు కావా!

సీతాదేవి యెంత పతివ్రతయో అంత త్యాగమూర్తి కూడాను. విరాధుడను రాక్షసుడు రామలక్ష్మణులను ఎత్తుకొని పారిపోవుచుండుట చూచి ఆమె పెద్దగా రోదిస్తూ "మాం హరోత్సృజ కాకుత్స్థౌ నమస్తే రాక్షసోత్తమ" (తనను భక్షించి రామలక్ష్మణులను వదిలిపేయమని) అని వేడుకుంటుంది. తన పతి కొరకు తన జీవితాన్ని సంతోషంగా త్యజించటానికి ఏమాత్రం

వెనుకంజ వేయలేదనే విషయం ఈ సంఘటనవల్ల అర్థమవుతున్నది.

సీతాదేవి ఉత్తమ గృహిణి. ఆమె తన అత్త మామలను జననీ జనకులవలె గౌరవించి ప్రేమించింది. అంతేకాదు శ్రీరాముని వనవాసానికి కారణభూతులైన దశరథుని గాని, కైకను గాని పల్లెత్తుమాట అనలేదు. అతిథులను మర్యాద చేయటంలోగాని, ఉచిత రీతిన సత్కరించటంలో గాని ఆమెకు ఆమే సాటి. గృహస్థ ధర్మమును చక్కగా పాటించిన సౌశీల్యవతి సీత.

సీతయొక్క పాతివ్రత్య ప్రతాప సౌందర్యమును "సుందరకాండ"లో వాల్మీకి చక్కగా వర్ణించాడు. మానవునియొక్క వ్యక్తిత్వము కష్టములయందే కనిపించును. అదేవిధముగా రావణునికి బందీగా అశోకవనములో క్రూరులైన రాక్షస స్త్రీల మధ్య వున్నప్పుడు సీతయొక్క వ్యక్తిత్వం బాగా కనపడుతుంది. సామాన్య వ్యక్తులు, అనుకూల పరిస్థితులలో, దైవానుకూల్యముచే ఉన్నతస్థితి నందుకొనినను, విషమ పరిస్థితులలో లక్ష్య భ్రష్టులగుదురు. మహాత్ములట్లుగాక విషమ పరిస్థితులు దాపురించినప్పుడు గూడ భయపడక, ఆత్మ స్థైర్యమును కోల్పోవక, ధైర్యంతో పరిస్థితులను ఎదుర్కొని తమ లక్ష్యమును, కర్తవ్యమును, ధర్మమును విడవక, అవసరమైతే తమ ప్రాణముల పైనను బలి పెట్టుటకు ఏమాత్రం వెనుకాడక, లక్ష్య సిద్ధికై నిరంతరమూ పోరాడుచునేయుందురు. సాధ్వీమణులైన సీతకూడా యిదేవిధంగా పన్నెండు నెలలపాటు ఆహార నిద్రాదులను సయితం విడనాడి, నిర్భయంగా రాక్షస స్త్రీల యొక్కయు, రావణుని బెదరింపులకును ఏ మాత్రం లొంగకుండా కాలాన్ని గడిపింది, ధైర్యంతో కష్టాల నెదుర్కొన్నది, యమయాతనలననుభవించింది, శీలాన్ని కాపాడుకుంది, లక్ష్యాన్ని సాధించింది.

సీత తన పతియైన శ్రీరాముని గూర్చి హీనంగా, మాట్లాడుతున్న రాక్షస స్త్రీలకు ధైర్యంగా సమాధానం చెప్పింది.



"దీనోవా రాజ్యహీనోవా,
యోమే భర్తా సమే గురుః
తం నిత్యమనురక్తాస్మి,
యథా సూర్యం సువర్చలా"

అనగా దీనుడు గాని లేక రాజ్యహీనుడు గాని, నా భర్త నాకు పూజ్యుడు. సూర్యునియందు సువర్చలవలె రామునియందు నేను నిత్యానురక్తమై యుందునని సీతాదేవి ఏ మాత్రం సంకోచించకుండా సమాధానం చెబుతుంది.

తనను వివాహమాడి పట్టమహిషివి కమ్మని రావణుడు ఎంతో ప్రాధేయపడుతాడు, అర్థిస్తాడు, చివరకు బెదరిస్తాడు. అయినప్పటికీ సీత ఏమాత్రం చలించదు. ధైర్యంగా రావణునితో "నీవు నన్ను చూచి భ్రమించితివి. జంబుకం వంటి నీకు, ఆడుసింగము వంటి నేను దుర్లభురాలునని ఎరుగుము. ఒక

# ప్రశ్నలు-సమాధానాలు

1. బ్రాడ్‌గేజ్‌లో రెండు రైలుపట్టాల మధ్య దూరమెంత ?
2. "ప్లిమ్‌సోల్" లైన్ అంటే ఏది ?
3. ప్రపంచంలోకెల్లా పొడవైన విమానాశ్రయం ఎక్కడ ఉంది ?
4. మన దేశంలో ప్రస్తుతం ఎన్ని రాష్ట్రాలు, ఎన్ని కేంద్రపాలిత ప్రాంతాలు ఉన్నాయి ?
5. ఆరోగ్యవంతుడైన మానవుని శరీరంలో ఎన్ని లీటర్ల రక్తం ఉంటుంది ?
6. ఫ్రాన్స్ దేశాధ్యక్షుని పదవీ కాలమెంత?
7. పిన్‌కోడ్ సౌలభ్యానికై ఇండియాను ఎన్ని జోన్లుగా విభజించిరి ?
8. ఇజ్రాయెల్ దేశస్థుల రాష్ట్ర భాష ఏమిటి ?
9. విటమిన్ "ఎ" యొక్క రసాయనిక నామమేమి?
10. టెన్నిస్‌లో "సీడెడ్ ప్లేయర్లు" ఎలా లాభం పొందుతారు ?
11. "లుసాకా" నగరం ఏ దేశపు రాజధాని ?
12. 1980 లో జాతీయం చేసిన బ్యాంక్‌లలో కెల్లా పెద్దది ఏది ?

1) 5 అడుగులు 2) ఓడలోని బరువుకు గరిష్ఠ హద్దు రేఖ 3) సౌదీ అరేబియాలోని జెడ్డా నగరం 4) 25 రాష్ట్రాలు, 7 కేంద్రపాలిత ప్రాంతాలు 5) 5 నుండి 6 లీటర్ల వరకు 6) 7 సం॥లు 7) 8 8) హెబ్రూ భాష 9) రెటినాల్ 10) కొన్ని రౌండ్ల వరకూ వారు ఆడనవసరంలేదు 11) జాంబియా 12) ఆంధ్రా బ్యాంక్

వేళ వజ్రధరుడగు ఇంద్రుని భార్యను అవమానించి బ్రతికిన బ్రతుకవచ్చునేమో గాని, శ్రీరామచంద్రుని భార్యనగు నన్ను బలాత్కారముగా హరించి, నీవు అమృతమును త్రావియుండినను మృత్యువునుమాత్రం తప్పించుకొనజాలవు" అని సీతాదేవి అంటుంది. ఎటు చూచినా నూరు యోజనాల సముద్రం. నా అన్నవారు ఎవరూ సమీపాన లేరు. ఎటు చూచినా అతి భయంకరులైన రాక్షసులు. వారు పెట్టే బాధలు, రావణాసురుని బెదరింపుల మధ్య నిస్సహాయురాలై వుండి కూడా ఏమాత్రం చలించక, ఆత్మవిశ్వాసాన్ని కోల్పోక, ధైర్యాన్ని విడనాడక, పరిస్థితుల ప్రభావానికి లొంగక రావణుని భోగభాగ్య ఐశ్వర్యములను కాలదన్ని, భారత నారీ ఔన్నత్యాన్ని లోకమునకు చాటినది. భారత స్త్రీకి 'పాతివ్రత్యము' అనునది ఒక మహత్తరమగు తపమని, అట్టి తపోనిష్ఠురాండ్రగు స్త్రీలను వంచింపువారు, ఎంతటి బలపరాక్రమ సంపన్నులైనను, అగ్నిలో పడిన మిడుతలవలె దగ్ధమైపోవుదురని 'సీత' లోకానికి చాటినది. ఎన్ని కష్టము లొచ్చినను వాటిని లెక్కచేయక, ధైర్యంతో ఎదిరించి పోరాడగల ఆత్మబలం, నైతికశక్తి భారత స్త్రీలకు కలదని సీతాదేవి నిరూపించింది.

హనుమంతుడు, అశోకవనంలో సీతయొక్క విషాదకర పరిస్థితిని కన్నులారా చూచి "నీవు నా వీపుపై ఎక్కుము, నిన్ను శ్రీరామునివద్దకు చేరుస్తాను" అని అంటాడు. కాని సీత అంగీకరించదు. "నీచకార్యమాచరించిన రావణుని, అతని అనుచరులగు రాక్షసులను సంహరించకుండా, నన్ను తీసుకొని వెళ్ళినచో, అది శ్రీరామునికి తగినట్లుండదు" అని సీత అంటుంది. ఈ మాటలు ఆమె యొక్క స్వాభిమానానికి నిదర్శనం. అంతేకాదు శ్రీరాముని బలపరాక్రమాదులయందు గల విశ్వాసం అటువంటిది. అంతేకాదు అవకాశం దొరికింది గదా యని తొందరపడి హనుమంతునితో వెళ్ళటానికి

అంగీకరించినయెడల, రావణుడు ఏ విధంగా దొంగతనంగా సీతను అపహరించాడో, అదే విధముగా శ్రీరాముడు కూడా దొంగతనంగా హనుమంతుని ద్వారా తీసుకొనివెళ్లాడనే అపవాదు వస్తుందని సీత అభిప్రాయపడింది శ్రీరాముడి పరాక్రమాన్ని రాక్షసులు చవిచూచే అవకాశం లేకుండా పోతుందని భావించింది. ఎంతటి కష్టాలనైనా భరించటానికి సిద్ధపడిందిగాని, శ్రీరామునికి అపవాదు రావటానికి మాత్రం సీత ఇష్టపడియుండలేదు సంవత్సర కాలం పాటు భర్త వియోగబాధను, దుష్టుడైన రావణుని బెదరింపులను, రాక్షస స్త్రీలు పెట్టే బాధలను ఓర్మితో సహించిన సాధ్వీమణి సీతాదేవి.

రావణ వధానంతరం అతని భార్య మండోదరి విలపిస్తూ 'పతివ్రతాయాస్తక సానూనం దగ్ధోఽసి మే ప్రభో' (నీవు పతివ్రతయగు సీతయొక్క తేజము చేత దగ్ధమైనావు) అని యనును. సీతయొక్క పాతివ్రత్య తేజమును, శీలసంపదను రాక్షసులు సయితమూ గుర్తించినారనడంలో ఏమాత్రం సందేహం లేదు.

రావణ వధానంతరం, శ్రీరాముని శంకితాపూరితమైన మాటలు విని ఎంతో వ్యధ చెందుతుంది. తాను దైవముగా భావించిన భర్త పదిమందిలో చులకనగా మాట్లాడి, తన శీలాన్ని శంకించినప్పటికీ, ఆ పతివ్రతా తిలకము తన ఓర్పును విడనాడలేదు. భర్తను విందించలేదు. శ్రీరాముని ఆజ్ఞానుసారము లక్ష్మణుడు చితిని ప్రజ్వలింపజేయగా, తన భర్తకు ప్రదక్షిణం చేసి, దేవతలకు ప్రణామ మొనర్చి అగ్నిలో దుమికేముందు "నాయొక్క హృదయము నిత్యమూ రాఘవుని తప్ప, ఇతరుని మీదకు పోకుండ నున్నచో, నన్ను సకల విధముల అగ్ని రక్షించుగాక !" అని అగ్నిలో ప్రవేశిస్తుంది. అగ్ని ఆరిపోతుంది. "ఓ! రామా ! పాపరహితురాలగు ఈ సీతను పరిగ్రహింపుము" అని అగ్నిదేవుడు చెబుతాడు. నిండుచూలాలిగా నున్న సమయమున తనను ఘోరారణ్యముల యందు విడిచి పుచ్చిన సమయమునకూడ, తన భర్తను గురించి ఒక్క పరుషమైన మాటను కూడా అనలేదు. పైగా మిక్కిలి శ్రీరాముని హితమును, క్షేమమును కోరినట్లు తెలుస్తున్నది. సీతా సాధ్వి తన లోకోత్తరములగు శీలవృత్తము చేతను, క్షమాకరుణల తోడను, స్నేహవాత్సల్యములతోడను, సర్వలోకముల నాశ్చర్య చకిత మొనరించుటతో బాటుగ భారతనారీ యొక్క మహత్వమును లోకము ముందుంచినది భారతనారి యొక్క గౌరవప్రతిష్ఠలను తన పవిత్ర చారిత్రముచే యినుమడింపజేసింది. సకల స్త్రీ జాతికి ఆదర్శముగా నిలిచినది. ఈయమ్మ చరిత్రము సకల నారీ లోకమునకు గర్వకారణము. రానున్న ఉత్తరాలలో లక్ష్మణుడు, భరతుడు, హనుమంతుల గురించి వివరించటానికి ప్రయత్నిస్తాను.

నీవు వ్రాసిన రెండు ఉత్తరాలు శ్రద్ధగా చదివాను. స్వాభిమానంతో వ్రాసిన ఉత్తరాన్నిచూచి గర్వించాను, రెండవ ఉత్తరాన్ని చూచి విచారించాను. అన్నీ తెల్సిన నీవే ఈ విధంగా దిగులు పడితే మన పిలల పరిసితి ఏమిటి ? చిరంజీవులకు నా ముద్దులు.

ఇట్లు

'శ్రీ'

## విదురనీతి

"న సా సభా యత్ర న సన్తి వృద్ధా
న తే వృద్ధా యే న వదన్తి ధర్మమ్
నాసౌ ధర్మో యత్ర న సత్యమస్తి
న తత్ సత్యమ్ యచ్ఛలేనాభ్యుపేతమ్.

అనగా ఏ సభయందు వృద్ధులుండరో, అది సభ కాదు. ఏ వృద్ధులు ధర్మమును పలుకరో వారు వృద్ధులే కారు. దేనియందు సత్యముండదో, అది ధర్మము కాజాలదు. ఏది మోసముతో నిండి యున్నదో, అది సత్యము కాదు.

# సమయస్ఫూర్తి, సమాజదృష్టి, సంఘశక్తి

స్త్రీని పరాక్రమంలో ఆదిశక్తి అనీ, వాత్సల్యం చూపటంలో జగన్మాత అనీ అంటారు. "కరుణించి చూచితే వెన్నెలలు విరియు, కన్నెఱ్ఱ జేసితే మిన్నులే విరుగు" అని ఒక మహాకవి భారతమాతను స్తుతించాడు.




త్రేతాయుగంలో సీతాదేవి, రావణుని చెరలో సంవత్సరకాలంపాటు ఏకాకిగా ఉన్నా, ఆమె పాతివ్రత్య మహిమవల్ల, మనోధైర్యంవల్ల ఏమైనాసరే తనను చెరబట్టిన రావణునికి బుద్ధిచెప్పి తీరాలనే దృఢ సంకల్పంతో బాధలను భరించింది, రావణుని అంతం చూసింది.

ద్వాపరంలో, ధర్మమూర్తులు, జగదేకవీరులైన పంచపాండవులు భీష్మ ద్రోణ కృపాచార్యులు, ధృతరాష్ట్ర విదురుల సమక్షంలోనే పాండవుల ధర్మపత్ని ద్రౌపదికి, ఏ స్త్రీకి జరుగగూడని అవమానం నిండు కొలువులో జరిగింది. అప్పుడు ద్రౌపది ఏం చేసింది ? భౌతికశక్తిని కోరకుండా, తన నైతికశక్తిమీద విశ్వాసముంచి, భక్తితో శ్రీకృష్ణపరమాత్మను వేడుకొని తన మాన సంరక్షణ గావించుకుంది.

అలనాడు త్రేతాయుగంలో సీతను చెరబట్టినందులకు రామరావణ యుద్ధం జరిగింది. ద్వాపరంలో ద్రౌపదికి జరిగిన అవమానానికి ప్రతీకారంగా భారత యుద్ధం జరిగింది. భౌతికశక్తితో పాటు, నైతిక ఆధ్యాత్మిక శక్తులు వారు కలిగివుండటం వలన దైవీశక్తి తోడై త్రేతాయుగంలో శ్రీరాముడు, ద్వాపరంలో పాండవులు విజయాన్ని సాధించగలిగారు.

ఈనాడు కలియుగంలో స్త్రీకి రక్షణ లేకుండా పోయింది. ఒంటరిగా బజారుకు వెళ్ళిన స్త్రీ క్షేమంగా తిరిగి వస్తుందనే నమ్మకం లేదు. ఎక్కడ చూచినా మానభంగాలు, అత్యాచారాలు విచ్చలవిడిగా జరుగుతున్నాయి. స్త్రీలు అమానుషంగా పదిమంది సమక్షంలో అవమానించబడుతున్నా ఎవరూ నోరు మెదపపడటం లేదు. ప్రేక్షకులలాగే చూచి తలలొంచుకుంటున్నారు. ఈమధ్య జరిగిన 'దాదర్ సంఘటన' ఇందుకు తార్కాణం. ఏ ఒక్క మగ ప్రయాణీకుడు నోరు మెదపలేదు. నోరెత్తిన ఒక స్త్రీని పండ్లూడకొట్టారు దుండగులు. మిగతా ప్రయాణీకులు చూచి కూడా చూడనట్లుగా నటించి ప్రక్కకు తప్పుకున్నారు. దీనికి కారణమేమిటి ? వీరిలో సమయస్ఫూర్తి వుండి వుంటే కనీసం 'చైన్' అయినా లాగివుండేవారు. పిరికితనం వీరిని ఆవరించింది. ఏమి అంటే ఏమి జరుగుతుందోననే భయం వీరిలో ప్రవేశించింది. ప్రాణాలమీద తీపితో మిన్నకుండిపోయారు. అంతేకాదు ఈనాడు సమాజంలో 'నన్నంటుకోకు నా మాలకాకి' అన్నట్లుగా, తనకేమి పట్టనట్లుగా వ్యవహరించే మనస్తత్వం ప్రబలిపోతున్నది అంతేకాదు తన శక్తిమీద తనకే నమ్మకం లేకుండా పోతున్నది. 'సంఘే శక్తి కలౌ యుగే' అనే విషయాన్ని కూడా విస్మరించటం జరుగుతున్నది. ఆనాడు ఆ బోగీలో ప్రయాణం చేస్తున్న అందరు ప్రయాణీకులు కలిసి సమైక్యంగా ఆ దుండగులను ఎదిరించివుంటే అంత ఘోరం జరిగి వుండేది కాదు.

దీనికి కారణం 'సమాజ లోపించటము, సంఘ శక్తి మీద విశ్వాసం లేకపోవటంవలననే ఇన్ని అనర్థాలు జరుగుతున్నాయి.

సమయస్ఫూర్తి, సమాజదృష్టి, సంఘ శక్తితో ఉద్యమించాలి. వీటికి నైతిక, ఆధ్యాత్మిక విలువలు తోడైనప్పుడు ఏ రంగములోనైననూ విజయమును సాధించవచ్చును. కేవలం భౌతికశక్తి మీదనే ఆధారపడినయెడల విజయాలు చేకూరవు. ఒకవేళ చేకూరినా అవి శాశ్వతంగా మనజాలవు. ఈ వాస్తవాన్ని సమాజం ఎప్పుడు గుర్తిస్తుందో? ఆ శుభ సమయం కోసం ఎదురుచూద్దాం. దానికి అవసరమైన సహాయ సహకారములను అందించటం ప్రతిఒక్కరి కర్తవ్యంగా భావించి, విశ్వసించి, ఆచరించుదాం.

- సాయి ప్రియ

# విజ్ఞానం

## బ్రెయిలీ

1829 లో లూయిస్ బ్రెయిలీ కాగితంపై చుక్కలను చేతికి తగిలే విధంగా చేసి, గుడ్డివారు అక్షరాలను గుర్తు పట్టే విధంగా బ్రెయిలీ లిపిని కనుగొన్నాడు.

బ్రెయిలీకి ఈ రకమైన ఆలోచన రావడానికి కారకుడు "కెప్టెన్ డార్బీర్" అనే ఫ్రెంచి దేశస్థుడు. అతని సూచనల మేరకు బ్రెయిలీ లిపి తయారుచేయ బడింది. 1932 లో ఇంగ్లీషు అక్షరాలు బ్రెయిలీలో ముద్రించి గుడ్డివారికి విద్యాబోధన ప్రారంభమైంది.

## బ్యాటరీ

1870 లో, ఇటలీ దేశస్థుడైన మెడిసిన్ ప్రొఫెసర్ లూగీ గాల్వానీ కప్పలపై పరిశోధన చేస్తుంటే ఒక కప్ప కాలు జారి క్రిందవున్న జింకు పళ్ళెంలో పడి అటు ఇటు కదిలింది. కప్పకాళ్ళలో కరెంటు వుందని భ్రమపడ్డాడు గాల్వానీ. కాని 1900సం॥లో అలెసాండ్రో వోల్టా, గాల్వానీ పరిశోధన లోపాలను గమనించి లోహంలో విద్యుచ్ఛక్తి వున్నట్లు ప్రకటించాడు. జింకు కాపర్ లోహాలనుపయోగించి బ్యాటరీ నిర్మాణం చేసాడు. విద్యుచ్ఛక్తి ఆ లోహ మిశ్రమాలు లవణం ఉపయోగించడం ద్వారా విద్యుచ్ఛక్తిని పొందవచ్చని బ్యాటరీ నిర్మాణం చేసాడు.

## విమానం

1874 లో ఆవిరిద్వారా గాలిలోకి ఎగిరే విమానాన్ని ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు "ఫేలెక్స్‌డూ పెంపుల్" కనుగొన్నాడు. పదేళ్ళ తర్వాత రష్యాలో "అలెగ్జాండర్ మోజైస్కి" ఇదే విధానంలో విమానాన్ని తయారు చేశాడు. కాని కొన్ని సెకండ్లు మాత్రమే అది గాలిలోకి ఎగరగలిగింది. 1890 లో ఫ్రాన్సు దేశస్థుడు "సెలె మెంట్ ఆడ్లర్" చేసిన విమానం 50 మీటర్ల ఎత్తు ఎగరగలిగింది. 1903 డిశంబరు 17 న "ఆర్వెల్ విల్‌బర్ రైట్ సోదరులు" తొలిసారిగా 12 సెకండ్ల పాటు పూర్తి కంట్రోలు చేయగలిగిన విమానాన్ని 3, 4 మీటర్ల ఎత్తు కెగిరించారు. అదేరోజు వారు మరో మూడు విమానాలను చేసి అరమైలు దూరం వరకు ప్రయాణం చేయగలిగారు. 1908 లో మరో విమానాన్ని చేసి ఫ్రాన్స్‌లో 50 మైళ్ళ దూరం ప్రయాణం చేయ గలిగారు. 1906నుంచీ ఫ్రాన్స్‌లో 'వాయిసిన్ బ్రేదర్స్' అను కంపెనీ విమానాలను తయారుచేయడాన్ని ప్రారంభించారు.

- జి. ఎస్. సాయినాథ్

# స్వర్గానికి ద్వారము 'హరిద్వార్'

భారతదేశము పవిత్ర పుణ్యక్షేత్రములకు నిలయం. అందులో హిమాలయములు పవిత్ర దేవాలయములకు, పుణ్య తీర్థములకు ప్రసిద్ధి. ఏ శిఖరము చూచినా ఆకాశాన్నంటుతున్నదా అనిపిస్తుంది. మంచుతో వెండిలా తళ తళ లా డే కొండలు, ఎత్తైన శిఖరాలు, లోతైన లోయలు, దట్టమైన అడవి వృక్షాలు, రకరకాల అందమైన పేర్లు తెలియని పుష్పాలు, చిన్న చిన్న సెలయేళ్లు, సన్నని బాటలు,అత్యంత సుందరంగా మనోహరంగా కొన్నచోట్ల వేగంగా, మరికొన్నిచోట్ల నిదానంగా, గలగలలాడుతూ ఒకసారి, గంభీరంగా ఒకసారి ప్రవహిస్తూ ఋషుల ఆశ్రమాల వద్ద ఆగుతూ అందరినీ పునీతంచేస్తూ ప్రవహిస్తుంటుంది గంగామాత.

"హరిద్వార్" (A Holi city) హిమాలముల ప్రారంభంలో వున్న అందమైన నగరం. దీనిని అనేకములైన పేర్లతో పిలుస్తుంటారు. "హరిద్వార్" (Door of God) దేవుని రాజ్యానికి (Kingdom of God) వెళ్ళటానికి ఇది ద్వారమని అంటారు. దీనిని "స్వర్గద్వారము" (Gate way of Paradise) అనికూడా అనవచ్చును.

సగర పుత్రులను పునీతులను చేయుటకు, భగీరథుని తపస్సుకు మెచ్చి, అమరలోకము నుండి బయలుదేరిన గంగ అహంకారముతో తన శక్తిని చూపిద్దామనుకొని అత్యంత వేగంతో దివి నుండి భువికి దూకింది. కానీ అన్నింటిని భరించి గర్వమణగింగచల సర్వశక్తి సంపన్నుడు ఒక్క పరమేశ్వరుడే. తన శిరస్సును ఆ ప్రవాహ వేగమునకు అడ్డుపెట్టి, జటా జూటంలో బంధించగ పాపం ! మళ్ళీ భగీరథుడు తపస్సుచేసి శివుణ్ణి మెప్పించి, తన వెంట గంగను తీసుకొనివెళ్ళి తన పూర్వీకులకు శాప విమోచనం గావించాడు. భగీరథుని వెంట బయలుదేరిన గంగకు భాగీరథిగా పేరు వచ్చింది. అందుకే ఎవరైనా పట్టువిడువక పని సాధిస్తే భగీరథ ప్రయత్నం ఫలించిందంటారు. ఈ గంగ హరిద్వార్ వద్దనే భూమి మీదకు వచ్చింది. ఇక్కడ అత్యంత సుందరంగా, అమిత వేగంగా పరుగులిడుతుంటుంది. ఆ వేగానికి సామాన్యులు తట్టుకోవటం కూడా కష్టమే. హిమాలయముల హిమము అంతా అందే వుంటుంది. మే నెలలో మధ్యాహ్నం స్నానం చేసినా వణుకు పుడుతుంది.

హరిద్వార్ నగరానికి చేరి, గంగానది దాటి లోపలకు అడుగు పెడుతుండగానే దేవాలయాల సముదాయం కనిపిస్తుంది. అక్కడ వాతావరణము యాత్రికులకు ఉత్తేజము కలిగిస్తుంది. అక్కడి దేవి, దేవతలను ఆరాధించుతారు. హరిద్వారము అనేక ఆశ్రమములకు ధర్మశాలలకు, సాధుసంతులకు నిలయం. 12 సం॥లకు కుంభమేళా, 6 సం॥లకు అర్థ కుంభమేళా జరుగుతాయి. లక్షల సంఖ్యలో యాత్రికులు అక్కడికి వస్తారు. ప్రతి సాయంత్రం గంగామాతకు హారతి కార్యక్రమము అత్యంత వేడుకతో జరుగుతుంది. ఆ పవిత్ర స్థలమునకు "హర-కి-పౌరి" అని పేరు. విష్ణువు యొక్క చరణ ముద్ర అక్కడ పైభాగంలో వుంటుంది. గంగ విష్ణు పాదస్పర్శచే పవిత్రత పొందినదని మన నమ్మకము. ఆ ప్రాంతంలో శంకరాచార్య, మాయాదేవి చండీ దేవి, నీలేశ్వరి, నవగ్రహ దేవాలయములు కలవు. మానసదేవి మందిరం ప్రక్కన వున్న కొండపైన వుంటుంది. అక్కడికి "రోప్‌వే "లో వెళ్ళి సందర్శించవచ్చును. మానసదేవి మందిరం నుండి చూస్తే హరిద్వార దృశ్యము ఆహ్లాదకరంగా వుంటుంది. అక్కడి గంగానది యొక్క సప్తపాయలు, వాటిపై నిర్మించబడిన వంతెనలు ఎంతో మనోహరంగా కనిపిస్తాయి. హర-కి-పౌరి యందు గంగ విష్ణు పాదముల

గుండా ప్రవహించుచున్నది గనుక ఆ ప్రాంతమునకు "హరిద్వార్" అని పేరు వచ్చింది.

శుంభ నిశంభులతో యుద్ధం చేయుటకు చాముండేశ్వరి ఎన్నుకున్న స్థలము మానస దేవి మందిరమునకు ఎడమ వైపున వున్న పర్వతము. చండీదేవి మందిరం గంగకు ఆవలనున్న కొండపై కలదు. ఆ పర్వతపు అంచులందు అంజనీదేవి మందిరమున్నది. దాని మూలస్థానమందు గౌరీశంకర దేవాలయమున్నది.



దక్ష ప్రజాపతి తాను చేయు యజ్ఞమునకు తన అల్లుడైన శంకరుని పిలువకపోయినా, సతి తన తండ్రి చేయు యజ్ఞమునకు వచ్చి అవమానించబడి, దానిని భరించలేక అక్కడే యోగాగ్నితో భస్మమైపోయింది. అది తెలిసిన శంకరుడు రుద్రుడై వచ్చి దక్షయజ్ఞమును నాశనంచేసి దక్షుణ్ణి సంహరిస్తాడు. దక్షేశ్వరమును నాశనంచేసి దానికి "శివపురి" అని పేరు పెడుతాడు. సతి మరణించిన స్థలాన్ని "మాయపురి" అని పిలుస్తారు. అది ఎంతో పవిత్రమైన స్థలమని భావించి అనేకమంది సాధువులు, మునులు, ఋషులు మాయపురిలో స్థిర నివాసమేర్పరుచుకున్నారు.

సప్త ఋషులు తపస్సు చేసిన పవిత్ర స్థలమిది. ఇక్కడ సప్త సరోవరాలున్నాయి. సప్త ఋషుల పర్ణశాలల నుండి గంగామాత సప్త వాహినులుగా ప్రవహిస్తున్నది. శ్రీ రాముని సోదరుడైన "భరతుడు" ఈ ప్రాంతంగుండా "హృషీకేశ్"కు వెళ్ళినాడని చెబుతుంటారు. అక్కడ భరత మందిరం కూడా ఉన్నది. ద్వాపరయుగంలో ఈ ప్రాంతము నుండే స్వర్గారోహణకు ఉపక్రమించినట్లు చెబుతుంటారు. ధృతరాష్ట్రుడు, విదురుడు, గాంధారి, కుంతి - ఇక్కడ తమ ఆత్మీయులకు కర్మకాండలు జరిపి స్వర్గప్రాప్తిని పొందినారు. ఈ హరిద్వార్ ప్రాంతము పురాణకాలము నుండి పవిత్రమైన పుణ్యక్షేత్రంగా విలసిల్లింది. ఆ రోజులలో దీనిని "మాయపురి" అని "గంగాద్వార్" అని "తపోవన్" అని పిలిచేవారు. కపిలముని ఆశ్రమము ఇక్కడనే వుండేది. భగీరథుని పూర్వీకులైన సగర పుత్రులు అశ్వమునకై అన్వేషిస్తూ యిక్కడికి వచ్చి దానిని కపిలాశ్రమంలో చూచి కపిలుని అనుమానించి ఆయన ఆగ్రహానికి గురియై దహించబడిన స్థలం యిదే. అందువలన దీనిని "కపిలస్థాన్" అని కూడా అంటారు. మహాకవి కాళిదాసు తన రచనలలో అక్కడి ప్రకృతి సౌందర్యాన్ని అతి మనోహరంగా వర్ణించాడు.

మన పవిత్రమైన దేవాలయాలెన్నో మొగలాయి దండయాత్రలకు గురియై సర్వనాశనం చేయబడ్డాయి. "హర్-కి-పౌరి" లోని పవిత్రమైన విష్ణుదేవాలయం కూడా వారి దండయాత్రలకు గురియై నేటికీ శిథిలాలయముగానే మనకు కనిపిస్తుంటుంది. "బ్రహ్మకుండ్" ఇక్కడనే వున్నది. ఇక్కడ గంగలో స్నానము చేసిన ఎట్టి పాపములైనా వైదొలుగుతాయని మనవారి నమ్మకం. అందువలనే నిత్యమూ వేలాదిమంది భక్తులు ప్రపంచ నలుమూలల నుండి ఇక్కడికి వస్తుంటారు

ఈ హరిద్వార్ నుండి పవిత్ర పుణ్యక్షేత్రాలైన హృషీకేశ్, బదరీనాద్, కేదార్‌నాద్, యమునోత్రి, గంగోత్రిలు దర్శించటానికి వెళ్ళాము. ఆ పవిత్ర పుణ్యక్షేత్రముల విశేషాలు తరువాయి వ్యాసములలో చదవండి. —కొమరగిరి రామమోహనరావు

# గీత - అమృతవర్షిణి

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్।
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా॥

పరమాత్మ ద్వివిధ స్వరూపుడు. 1) పరస్వరూపము 2) అపరస్వరూపము. పరస్వరూపమనగా నిరాకార నిర్గుణ పరబ్రహ్మ తత్త్వము. అపరస్వరూపమనగా అవతారస్వరూపము. దీనినే అనాదిస్వరూపము, అవతారస్వరూపము అనికూడా వ్యవహరిస్తారు. ఈ దివ్య శ్లోకమునందలి ప్రథమ పాదము పరస్వరూప తత్త్వమును ద్వితీయ చరణము అపరస్వరూప సంభవ విధానమును తేటతెల్లమొనర్చుచున్నది.

సాయి గంగా మహాదేవ్

పరమాత్మ ఎట్టివాడు ? 1) అజ 2) అవ్యయాత్మా 3) భూతేశ్వర - ఇట్టివాడు. "అజుడు" అనగా ఏమిటి ? 1) జననము లేనివాడు 2) కదలిక లేనివాడు అని అర్థము. "జననము లేనివాడు" అనగా నిర్వికారుడు, సత్యమూర్తి, ఏకస్వరూపుడు అని అర్థము. "కదలిక లేనివాడు" అనగా సర్వవ్యాపకుడు అని అర్థము. సర్వగతము, సర్వవ్యాపకమైన పదార్థమునకు చలనమెట్లు సంభవము ? కావున "అజః" అనగా సర్వవ్యాపకుడని అర్థము.

ఇక "అవ్యయాత్మా" - "అవ్యయ" మనగా క్షీణత లేనివాడని అంటారు. ఐతే అంతమాత్రమే కాదు. వృద్ధి, క్షీణతలు రెండునూ లేనివాడు అవ్యయుడు. ఎట్లు ? ఎట్లనగా ఏదేని ఒక తత్వము వృద్ధిచెందవలెననిన తన పూర్వస్థితిని క్షీణింపచేసుకొనవలసివుంటుంది. కనుక వృద్ధికూడనూ క్షీణత్వము యొక్క వికారమే. కావున "అవ్యయాత్మా" అనగా వృద్ధి, క్షీణతలు లేక సదా ఏకత్వముగా నుండువాడని అర్థము. అదియునుగాక "వ్యయ" అనగా జీవత్వమని అర్థము. "అ" అనగా పరమాత్మయని అర్థము. "అవ్యయాత్మా" అనగా సమస్త జీవులు ఏ పరమాత్మయందు ఉపస్థితమై వుంటున్నవో అట్టి జీవధారుడైన పరబ్రహ్మమనికూడనూ ఒక అర్థము. అనగా జీవుడు + దేవుడు = అవ్యయాత్ముడు. దీనినే పరిపూర్ణమంటారు.

ఇక "భూతేశ్వరుడు" - "భూతానామీశ్వరః" అనగా సమస్త ప్రాణులను నియమించువాడు - అని అంటుంటారు. కానీ అది పరిపూర్ణ సత్యము కాదు. భూతేశ్వరుడు - అనగా పంచభూతములకు ఈశ్వరుడు (నియామకుడు) అని అర్థము. సమస్త బ్రహ్మాండములు, లోకాలోకములన్నియును పంచభూత నిర్మితములే కనుక భూతేశ్వరుడనగా సకల లోక నియంత అని అర్థము. బ్రహ్మాండములకే అధిపతియైనప్పుడు ఆ బ్రహ్మాండ గత ప్రాణులు అతని ఆధీనములోనివి కావా ? కనుక సమస్త లోకనాథుడే భూతేస్వరుడని చెప్పబడింది. కనుక పరమాత్ముడు జనన రహితుడు, సర్వవ్యాపకుడు; వృద్ధి, క్షీణతలు లేనివాడు; పరపూర్ణ మూర్తి; సకల లోకనాథుడు.

విద్యుత్తు సకలవిధ విద్యుత్పరికరములలో చైతన్య శక్తిని కలిగింపచేస్తున్నప్పటికినీ ఇది నిరాకారముగా, అగోచరంగానే వుంటున్నది. పరమాత్ముడుకూడనూ పై లక్షణములను ఎన్నింటిని కలిగియున్ననూ నిరాకారుడుగా అగోచరుడుగానే వుంటాడు. ఇట్టి అగోచర పరమాత్మ గోచరం అయ్యే విధానం ఏమిటి ? అది ఇప్పుడు

చెప్పబడుతున్నది. "నా ప్రకృతిని నేనధివసించి, వశమందుంచుకొని నా స్వంత మాయచే సంభవిస్తుంటాను" అని భగవద్వచనము. అనగా ఏమిటి? ఇచ్చట చాలామంది వ్యాఖ్యాతలు "ప్రకృతి" శబ్దమునకు, "మాయ" శబ్దమునకు రెండింటికినీ "మాయ" అనే అర్థమునే ఉల్లేఖించారు. భగవంతుడు రెండు విభిన్న శబ్దములను ఎందుకు ప్రయోగం చేసినట్లు. ఏదో ఒక అంతరార్థము లేక చేయునా? అది విచారింతుము. ఆ రెండు పదములు ఒకటి కాదు.

"ప్రకృతి" అనగా అనేకానేక అర్థములు, వ్యుత్పత్యర్థములు వుంటున్నవి. ఇచ్చట తీసుకొనవలసినది "త్రిగుణసామ్యావస్థ" అని ఈ అవస్థను "ప్రకృతి" అని అంటారు. దీనినే "లయావస్థ" అని, "గుణాతీత"మని, "పరత్వ"మని కూడా అంటారు. త్రిగుణసామ్యము అనగా గుణరాహిత్యమే. కావున "గుణరహితమైన నా నిరాకార నిర్గుణత్వమునే నేను కలిగివుండి నా మాయచే నేను గోచరమౌతాను, అవతరిస్తాను" అని అర్థము. "మాయ" అనగా ఏమిటి? "మాత్యస్యాం విశ్వమితి మాయా", దీనియందు విశ్వము మితమైయుంటుంది – ఇది మాయ. అనగా పరిమితిని కల్పించునది మాయ. అనగా అనంతుడు, నిరాకారుడు – ఒక ఆకారంతో గోచరమగుటకు ఇది అవసరమే కదా? కనుక ఈ శ్లోకార్థమే మనగా –

"సర్వవ్యాపకుడను, నిర్వికారుడను, పంచభూత నియామకుడనైన నేను; నా గుణరహిత స్థితిని వీడక ఆ దివ్యత్వముతోనే నా మాయతో నేను పరిమితునిగా గోచరమౌతాను" అని అర్థము. అనగా అవతారమూర్తి మానవునిగా గోచరమౌతున్ననూ అతడు గుణరహితుడే సర్వవ్యాపకుడే, జన్మశూన్యుడే. ఆ కనిపించే ఆకారము కూడనూ నిరాకారమేనని అర్థము. అవతారమిట్టి దివ్యత్వ సమన్వితమైనది.

# చైతన్య వాణి

గీత సత్యదర్శిని, సత్యస్వరూపిణి. మానవ సమస్యలను ముంజేతి కంకణమువలె దర్శించగలదు. పరిష్కారములను పడ్డించిన విస్తరివలె ముందుంచగలదు.

* భగవంతుడు కావాలా? అయితే అందరినీ ప్రేమించు. ఆనందం కావాలా? అయితే అభాగ్యులకు సేవ చేయి.

* ప్రతి వ్యక్తిలో మాధవుడు, మానవుడు యిద్దరూ వున్నారు. నవ్వినపుడు మాధవుడు తొంగి చూస్తాడు. ఏడ్చినపుడు మానవుడు పొంగి వస్తాడు. నవ్వుతూ జీవించడం అలవరచుకో. పరిస్థితులు మన అధీనములో వుండవు. కానీ ప్రవర్తన మన అధీనమే.

* దేహాలందరికీ వున్నాయి. వాటి వివరాలు వైద్యునికే తెలుసు. మనస్సులందరికీవున్నాయి. వాటి గతులు గురువుకే తెలుసు.

* బాధలు కలిగాయని చింతించకు. బోధలతో వాటిని బాగుచేసుకో. నీ సేవలను అందరూ గ్రహిస్తారు. నీ బాధలను భగవానుడే అర్థం చేసుకోగలడు, నిన్ను అనుగ్రహించగలడు, ఆశీర్వదించగలడు.

సేకరణ: మల్లాది సూరిబాబు

ఆహా! నేటివారలెంత ధన్యులో కదా! పరిపూర్ణావతారమైన భగవాన్ శ్రీ సత్యసాయీశ్వరులను తనివి దీరా గ్రోలుతున్నారు. ఇట్టి దివ్యమైన, అవాఙ్మానస గోచరమైన ఈ అవతార మధురసుధా స్రవంతుల గ్రోలి, దానిలో తూలి, వాలి, ఓలలాడుదురుగాక!



# దీర్ఘ జీవితాన్ని కాదు దివ్య జీవితాన్ని ఆశించాలి

మానవుడు ఆశించవలసినది దీర్ఘజీవితము కోసము కాదు. దివ్య జీవితము కోసము ఆశించాలి. దివ్యమైన ఈ ప్రకృతియందు మానవుడు దివ్యత్వమును పొందటమే ప్రధాన కర్తవ్యము. సృష్టిరహస్యము సృష్టికర్తకు

**శ్రీసత్యసాయి బాబా**

తప్ప అన్యులకు అర్థం కాదు సృష్టి రహస్యమును గురించటానికి ప్రయత్నించేవారే సైంటిస్టులు. అయితే ఈ సృష్టి రహస్యమును పరిపూర్ణముగా ఎవ్వరూ గుర్తించలేరు. ఈనాటి పరిశోధనలు రేపటికి పాతవైపోతున్నాయి. రేపటి పరిశీలన ఎల్లుండికి పాతదైపోతున్నది. వైజ్ఞానికుడు పాతదంతా రోతదిగా భావిస్తుంటాడు సృష్టి అంతయు క్షణక్షణమునకు మార్పు చెందునదే. ఇది నిత్యమైనది, సత్యమైనది కాదు. నిత్య సత్య నిర్మలమైన తత్వము సృష్టికర్తయే. సృష్టికర్తను పరిశీలన చేసి, పరిశోధన చేసి సృష్టికర్తను పొందేదే ఆధ్యాత్మిక మార్గము.

ఈ చరాచర ప్రపంచమంతయు త్రిగుణాత్మకమైనది. త్రిగుణాత్మకమైన ప్రపంచమే త్రిమూర్తి స్వరూపము. సృష్టి స్థితిలయములకు త్రిగుణములే మూలకారణము. తమ స్వరూప స్వభావములతో, విశేషములతో, వికారములతో లోకాలను ప్రకాశింప చేసేది త్రిగుణములే. గుణాతీతమైన తత్వాన్ని గుర్తించే వ్యక్తిత్వమే నిజమైన మానవత్వము. భగవంతుడు ఆత్మస్వరూపుడు. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అని బ్రహ్మమన్నా, సత్యమన్నా, అనంతమన్నా, ఆత్మ అన్నా, భగవంతుడన్నా అన్నీ పర్యాయ పదములే. మొట్టమొదట ఆత్మనుండి పంచభూతములు ఆవిర్భవించాయి. పంచభూతములు పంచతత్వములను యిముడ్చుకొని వుంటున్నాయి. పంచభూతములనుండి పంచీకృతము ఆరంభమైనది. పంచీకృత భావమునుండి ఆవిర్భవించినవే త్రిగుణములు. త్రిగుణములయొక్క ఆకారమే ఈ విశ్వము. విశ్వమునందు సత్వరజస్తమో గుణములు నిండి ఉంటున్నాయి. సత్వసృష్టి యొక్క రహస్యాన్ని మొట్టమొదట గుర్తించాలి. సత్వసృష్టి యొక్క సమిష్టి సత్వాంశమే అంతఃకరణ. పంచభూతముల సమిష్టి సత్వాంశమే అంతఃకరణ. ఆకాశ సత్వ సృష్టి ఐన యిది వ్యష్టితత్వాన్ని అనుభవిస్తూ వచ్చింది. భూతములలో ఆకాశము మొదటిది. ఈ ఆకాశము యొక్క వ్యష్టితత్వము నుండి శుద్ధ సత్వాంశము ఒకటి బయలు దేరింది. ఇదియే మానవాకారములకు ప్రథమ స్థానము. ఆకాశముయొక్క వ్యష్టిసత్వము నుండి చెవి పుట్టింది. పంచభూతములలో రెండవది గాలి. ఈ గాలి వ్యష్టిసత్వమైన అంశమే చర్మము. పంచభూతములలో మూడవది అగ్ని. అగ్నియొక్క వ్యష్టిసత్వాంశమే కన్ను. పంచభూతములలో నాల్గవది నీరు. దీని వ్యష్టి సత్వాంశమే నాలుక. పంచభూతములలో ఐదవది భూమి-ప్రకృతి. ప్రకృతి వ్యష్టి సత్వాంశమే ముక్కు. శబ్ద స్పర్శ రూప రస గంధములు ప్రథమమున పంచ

భూతముల శుద్ధసత్త్వము నుంచి ఆరంభమైనాయి. ఒక్కొక్కటి వ్యష్టిభూతము కనుక ఆ వ్యష్టి నుండి ఆవిర్భవించిన ఈ అంగములు ( ఇంద్రియములు ) ఒక్కొక్క పనికి మాత్రమే ఉపయోగించుకోవటానికి వీలవుతుంది. ఆకాశము గుణము శబ్దము. శబ్దమునకు చిహ్నము (ఇంద్రియము) చెవి. చెవి వినుటమాత్రమే తప్ప అన్యము ఎరుగదు. రెండవ భూతమైన గాలి గుణము స్పర్శ. స్పర్శకు చిహ్నము చర్మము. దీనికి శ్రవణశక్తి లేదు. మూడవది అగ్ని. దీని అంశము కన్ను. ఇది చూడగలదే కాని స్పర్శించలేదు. నాల్గవది నీరు. దీని అంశము నాలుక. నాలుక రుచి చూడగలదే కాని వ్యక్తిని చూడలేదు. ఐదవది ప్రకృతి. ప్రకృతి యొక్క అంశము ముక్కు. ఇది వాసన చూడగలదే కాని రుచిని చూడలేదు. ఈ అంశములు ప్రతిబింబము లగుటచేత ఒక్కొక్క గుణమును మాత్రమే ఇవి స్వీకరిస్తూ వచ్చాయి.

పంచభూతముల యొక్క సమిష్టి స్వరూపమే అంతఃకరణ. అంతఃకరణకు శబ్ద స్పర్శ రూప రస గంధములు అన్నీ అనుభవించే అధికారముంటున్నది. ఇవి జ్ఞానేంద్రియములకు మాత్రమే సంబంధించినవి. ఈ జ్ఞానేంద్రియములు దేహమునకు వెలుపలివా ? లోపలివా? అని విచారిస్తే ఇవి అంతర్బహిస్వరూపాలు. కర్మేంద్రియమైన చెవి మాత్రమే వుంటుండి జ్ఞానేంద్రియమనే వినుశక్తి లేకపోయినప్పుడు చెవి వుండి ప్రయోజనం లేదు. జ్ఞానేంద్రియమనే వినుశక్తి వుండి కర్మేంద్రియమనే చెవి లేకపోతే వినలేదు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియ సమ్మిళితమైన స్వరూపమే ఈ వ్యష్టి తత్త్వము. బయట లౌడ్‌స్పీకర్సు పెట్టారు. ఇక్కడ గనుక మైకు లేకపోతే లౌడ్‌స్పీకర్ల ప్రయోజనంలేదు. ఇక్కడ మైకు, అక్కడ స్పీకర్ వుండాలి. ఈ రెండింటి సమ్మిళిత స్వరూపమే ఇక్కడి తత్వాన్ని అక్కడికి, అక్కడి తత్వాన్ని ఇక్కడికి ప్రసరింప జేస్తుంది. ఈ శుద్ధసత్త్వమైన సత్త్వగుణ సంపత్తియే శబ్ద స్పర్శ రూప రస గంధాలు. ఇవి సత్త్వగుణమునకు సంబంధించినవి. రజోగుణము యొక్క సమిష్టి పంచభూతముల స్వరూపమే ప్రాణము. సత్త్వగుణము యొక్క పంచభూత స్వరూపమైనది అంతఃకరణ. అయితే రజోగుణము యొక్క పంచభూతముల యొక్క సమిష్టి స్వరూపము ప్రాణముగా నిలిచింది. రజోగుణ సృష్టియందు పంచభూతములందు వ్యష్టిస్వరూపమైన ఆకాశము యొక్క బిందువు కన్ను. రెండవ భూతమైన వాయువు యొక్క వ్యష్టిస్వరూపమైన బిందువు చేయి. రజోగుణ సృష్టియందు మూడవదైన వ్యష్టిస్వరూపము అగ్ని. వ్యష్టిస్వరూపమైన అగ్నియొక్క సృష్టికాలు. నాలుగు, ఐదు అయిన నీరు, ప్రకృతుల వ్యష్టి సృష్టి మలమూలములు విసర్జించు ప్రదేశములు. సత్త్వగుణ సృష్టియందు వ్యష్టి సృష్టిగా వచ్చిన ఆకాశము యొక్క మొదటి సృష్టి చెవి. రజోగుణమునందు వ్యష్టి సృష్టి ఆకాశము యొక్క సృష్టి కన్ను. ఏతావాతా ఆకాశమునకు ఇద్దరు బిడ్డలు. రజోగుణము బిడ్డ వాక్కు. సత్త్వగుణము బిడ్డ చెవి. ఆకాశము మొదటి బిడ్డ చెవి. రెండవ బిడ్డ వాక్కు. మొదటి బిడ్డయైన చెవి బయట విషయాన్ని లోపలికి స్వీకరిస్తుంది. రెండవ బిడ్డ అయిన వాక్కు స్వీకరించిన దానిని బయటకు విడిచిపెడుతుంది. సత్త్వగుణము యొక్క వాయువు బిడ్డ చర్మము. రజోగుణము యొక్క వాయువు బిడ్డ చేయి. ఎక్కడైనా దేహముపైన ఏదైనా చీమ పారాడుతుంటే చర్మము స్పర్శ తెలుసుకుంటుంది. తెలుసుకున్న తక్షణమే చేయి దానిని తీసి పారవేస్తుంది. ఏతావాతా సత్త్వగుణము యొక్క అంశములు స్వీకరించటము, రజోగుణము యొక్క సంతతి దానిని విసర్జించటము. అయితే ఈనాడు లోకము ఏ రీతిగా వున్నదంటే విసర్జించవలసిన రజోగుణము స్వీకరిస్తున్నది. దీనిని ఉల్టా సీదా అంటారు. సత్యగుణమే స్వీకరించాలి.

ప్రకృతికి సత్త్వగుణమే మొద్దమొదటి పదము. ఈ ప్రకృతికి స్త్రీ అని ఒక పేరు. స్త్రీ అనగా 'స' కార

'త'కార, 'ర'కారములతో కూడినది. 1. సత్వగుణము 2. తమోగుణము 3. రజోగుణము. మొదటి సాత్వికము స్వీకరించాలి. రెండవది తమోగుణము. అనగా మర్యాదగా, వినయముగా, అణుకువగా వుండే గుణములు అభివృద్ధిపరచుకోవాలి. మూడవదైన రజోగుణమనేది విధిలేని పరిస్థితులయందు కట్టకడపట స్వీకరించవలసినదే కాని మొట్టమొదట స్వీకరించవలసినది కాదు. ప్రకృతి రహస్యమునందు ప్రప్రథమములో ప్రారంభమయ్యేది 'స'కారమే. అదే సాత్వికము. ప్రతి మానవుడు సత్వగుణ అంశమునందు, సత్వగుణ ప్రక్రియయందు సత్వగుణ తేజస్సునందు, సత్వగుణ మార్గమునందు, సత్వగుణ ప్రవర్తనయందు మానవత్వం అభివృద్ధిగావించుకోవాలి.

ఇంక తమోగుణము. సృష్టి పంచభూతముల మిశ్రమమై ఉంటున్నది. పంచభూతములు పరిపూర్ణ భూతములు, మిశ్రమము కాలేదు. పంచీకృతములు యిక్కడ చేరిపోయాయి. ఇది అందరికీ అర్థమయ్యే విషయము కాదు. అర్థమయ్యే నిమిత్తమై ప్రాపంచిక సంబంధమైన ఒక ఉపమానాన్ని చెబుతాను. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి – ఈ ఐదు, ఐదు వ్యష్టిస్వరూపాలు. ఈ ఐదుగురు ఒకచోట చేరినారు. ఒక్కొక్కరివద్ద ఒక్కొక్క రూపాయి ఉందనుకుందాం ఆకాశము అనేవాడు తన రూపాయిని చిల్లరగా మార్చి అర్థరూపాయి తనవద్ద వుంచుకొని మిగతా అర్థరూపాయిని ఒక్కొక్కరికి రెండేసి అణాల చొప్పున పంచాడు. అదే విధముగా వాయువు, అగ్ని, జలము, పృథ్విలు చేసినారు. అప్పుడు అందరివద్ద రూపాయి రూపాయిగానే మిగిలింది. అయితే పూర్వం ఒకే రూపాయి నాణెము వుండేది. ఇప్పుడు ప్రతివానివద్ద రూపాయి చిల్లర చేరింది. పూర్వముండిన పంచభూతములే ఒక రూపాయి నాణెము. ఈ చిల్లర రూపాయిలే పంచీకృతములు. ఈ పంచీకృతముతో కూడిన మానవత్వం చిల్లర రూపాయిగా చలామణి అవుతున్నది. అనగా భిన్న భావములతో కూడివుంటున్నది. ఏకత్వమును అనేకత్వముగా భావించింది. పూర్వము అనేకత్వమైన ఏకత్వంగా వుండేది. పూర్వము ఒక రూపాయికి పదహారు అణాలు. అవే ఇక్కడ మనిషికి పదహారు గుణాలు. వీటినేఆధ్యాత్మికమందు షోడశకళలు అన్నారు. ఈ పదహారు కళలు ఏమిటి ? ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, ఉద్భవించిన పంచభూతములు మరియు మనసు ఒకటి – మొత్తం ఇవే పదహారు కళలు, కేవలం భగవంతుని యందే ఈ పదహారు కళలుంటున్నాయని భావించడం పొరపాటు. ప్రతి వ్యక్తి ఈ పదహారు కళలతో వుంటున్నాడు. "ఈశావాస్యమిదం సర్వం" అని "ఈశ్వర స్సర్వ భూతానామ్" అని ఈశ్వరుడు సర్వత్ర ఉంటున్నాడు.

మానవుడు ఏకత్వాన్ని అనేకత్వముగా మార్చటానికి కారణం ఏమిటి ? అభీష్టములే మూలకారణము. మానవత్వమును విస్మరించి అభీష్ట జీవితమును అభిలషించి అత్యంతోన్నత స్థాయికి అతి శీఘ్రముగా పోవాలని మానవుడు Short cuts (అడ్డదారి) కోసం ప్రయత్నిస్తున్నాడు. త్వరగా చేరవచ్చుననుకుంటున్నాడు. ఈ అడ్డదారి చూడటానికి దగ్గరగా కనిపిస్తుంది. అయితే ఇది రాళ్ళు, ముళ్ళు, కంపలతో అడ్డదిడ్డంగా వుండి నడవటానికి యిబ్బందిగా వుంటుంది. వీటి నన్నింటిని తప్పించుకొని పోవటంకన్నా, దూరమైనా రాజమార్గాన పోవటమే సులభంగా వుంటుంది. కానీ మానవుడు దగ్గర మార్గాన్నే కోరుతాడు. ఇది సరియైనది కాదు. దూరమైనప్పటికీ మంచి రాజమార్గమునే ఎన్నుకోవాలి.

భగవంతుడు తన సంకల్పములో అన్నింటి క్షేమము నిమిత్తమై అన్ని విధముల సృష్టిని ఆచరిస్తుంటాడు. ఒక భక్తుడు తాను శ్రీమంతుడు కావాలని ఆశించి లక్ష్మీదేవిని ప్రార్థించాడు. భౌతిక వాంఛలు నెరవేర్చుకొనే నిమిత్తమై ఎంతటి శ్రమలకైనా ఓర్చుకుంటాడు.

ఎన్ని కష్టములనైనా సహిస్తాడు. ఎన్ని నిందలు నిష్ఠూరములకైనా లెక్కచేయడు. కానీ పారమార్థిక మార్గమునకు ప్రయత్నించే భక్తుడు ఏ చిన్న కష్టము జరిగినా భరించుకోలేడు. ఈ భక్తుడు లక్ష్మీకటాక్షము కోసమని ఘోరమైన తపస్సు చేశాడు. లక్ష్మి ప్రత్యక్షమైంది. "నాయనా ! నీకేమి కావాలి ?" అన్నది. "నీవే కావాలి ! తల్లీ !" అన్నాడు. ఐతే నేను సర్వాలంకారభూషితురాలనై నీ వెంటే వస్తానన్నది. నీవు ముందు నడుస్తుండు. నేను నీ వెంట నీ ఇంటికి వచ్చి ఈ నగలనన్నింటిని అక్కడ విసర్జించి వస్తానన్నది. అయితే ఒక షరతు పెట్టింది. వెనుకకు తిరిగి చూడరాదు, ఒకవేళ చూస్తే నేను అక్కడనే నిలిచిపోతానని చెప్పింది. సరేనన్నాడు. కొంత దూరం ఆవిధంగా వారిరువురు నడిచారు. కొంత దూరం పోయేటప్పటికీ పెద్ద ధ్వని వినిపించింది. వెనుకకు తిరిగి చూచేటప్పటికీ లక్ష్మి అక్కడనే నిలిచిపోయింది. చూచితిరా ! ఆశ యొక్క ప్రభావము. అనుగ్రహమును పొంది కూడా అనుభవించలేకపోయాడు. భగవదనుగ్రహం నిండుగా, దండిగా వుండినప్పటికి అనుభవించే శక్తిని మనము సంపాదించాలి. ఆ శక్తి సంపాదించుకోవాలంటే ఆజ్ఞను పాలించాలి. లక్ష్మి ఆజ్ఞను మీరటం చేతనే లభించిన లక్ష్మిని అతను కోల్పోయాడు. లోకము స్థితి ఈ రకంగా వుంటున్నది.

లోకమంతా సత్వరజస్తమో గుణముల ప్రభావమై వుంటున్నది. ఈ సత్వరజస్తమో గుణముల సృష్టి మన దృష్టియందు చేరివుంటున్నది. పరిశీలనచేసి మన నేత్రములు చూడండి ! కన్ను కొనలలో ఎరుపు రంగు ఇదే రజోగుణము. అది దాటుతూనే సాత్వికము. ఆ సాత్వికమునకు మధ్య లోపలనే తామసికము వుంటుంది. అదే నలుపు. తెలుపు, ఎరుపు, నలుపు మూడు గుణములు మన దృష్టియందు వుంటున్నాయి. దైవము ఎక్కడ ఉన్నాడు ? ఎట్లా ఉంటాడు ? ప్రకృతియే మనకు సమాధానం చెబుతుంది. సూర్యోదయము, సూర్యాస్తమయము జరుగుతున్నాయి. దినములు, నెలలు, సంవత్సరములు జరిగిపోతున్నాయి. దీనికి కారణమేమిటి ? భూమి తనచుట్టూ తాను తిరగటంచేత సూర్యోదయ, సూర్యాస్తమయములు జరుగుతున్నాయి. భూమి సూర్యుని చుట్టూ తిరగటము వలన ఋతువులు ఏర్పడుతున్నాయి. వర్షములు కురుస్తున్నాయి పంటలు పండుతున్నాయి. ఇదియే ప్రత్యక్ష దైవము. "పశ్యన్నపి చ న పశ్యతి మూఢః" నీవు భగవంతుని చూస్తూ కూడ చూడలేదనుకుంటున్నావు. చాలా పొరపాటు. ప్రకృతియే పరమాత్మ స్వరూపము. ఈ ప్రకృతివల్ల మనం గుర్తించవలసినది ఏమిటి ? క్రియాశీలత. మన కర్తవ్యమును మనం నిర్వర్తించాలి. ప్రకృతి తన కర్తవ్యమును తాను పాటిస్తూ వుండటం చేతనే జగత్తుకు ఉపకారం చేయగలుగుతున్నది. సృష్టి యొక్క రహస్యము కర్తవ్యాచరణే. ఏ కర్మలో నీవు ప్రవేశిస్తున్నావో ఆ కర్మను నీవు శ్రద్ధాభక్తులతో చేయి.

మానవుడు సుఖించాలని తన సుఖం కోసం అనేక పెడమార్గాలు పడుతున్నాడు. అధికారులు, ధనవంతులు తమతమ ఆఫీసులకు పోతుంటారు. తమ పనులు తాము చేస్తుంటాడు. ఎవరి కర్తవ్య కర్మలు వారు ఆచరిస్తూ మాకు ఏమాత్రం శాంతి సుఖములు లేకుండా ఉంటున్నాయని వాపోతుంటారు. విశ్రాంతి కావాలంటారు. సంతోషం కోసం క్లబ్బులకు వెళుతుంటారు, చీట్లపేకలు ఆడుతుంటారు, త్రాగుతుంటారు. ఇవన్నీ సుఖశాంతుల కోసమేనని చెప్పుకుంటుంటారు. ఇది చాలా దుర్మార్గం. సుఖమనే అపేక్షతో వారు దుఃఖమును కొంటున్నారు. తాము చెడిపోవటమే కాకుండా సమాజమును కూడా చెడగొడుతున్నారు. ఇది మొదట సుఖంగానే కనిపించవచ్చును.

First the man drinks the wine
Second the wine drinks the wine
Third the wine drinks the man.

మొదట మద్యం తాను తీసుకుంటున్నానని భ్రమిస్తుంటాడు. కాదు! కాదు! అదే తనను తీసుకుంటున్నది. తరువాత అది అతనినే తీసుకుంటుంది. శాంతిని కోరి ఈ విధమైనటువంటి పెడమార్గమును బట్టి జీవితమును భ్రష్టు పట్టించుకుంటున్నాడు మానవుడు. నిజమైన శాంతి సుఖములు అనుభవించాలనుకుంటే సమాజసేవ చేయి. దీనులను దిక్కు లేనివారిని పోషించు. నీ శక్తి కూడనూ అభివృద్ధి అవుతుంది. మానసిక శాంతి లభిస్తుంది. నీవు చేసిన పని మంచిదని నీ కాన్షస్ తృప్తి పడుతుంది. నీవు సమాజంలో ఒక వ్యక్తివి. నీ క్షేమము సమాజ క్షేమముపైననే ఆధారపడి వుంటుంది. ఈ వాస్తవమును విస్మరించి దుర్మార్గములలో ప్రవేశించటం చేతనే మానవుడు శాంతి సుఖములకు దూరమైపోతున్నాడు.

'' Knowledge without action is foolishness, action without knowledge is useless' (కార్యాన్ని సాధించలేని జ్ఞానము మూర్ఖమైనది. జ్ఞాన రహితమైన కార్యము ఉపయోగము లేదు ).

ఈ knowledgeని మన action ను రెండింటిని ఏకం చేయాలి. ఇదే దివ్యత్వం, ప్రకృతి తత్వం రెండింటి యొక్క ఏకత్వం. ఈcreation భగవంతునికి వేరుగాలేదు. భగవంతునితోనే కూడి ఉంది. జీవ, ఈశ్వర, ప్రకృతి అని త్రిమూర్త్యాత్మక స్వరూపము. ఈ మూడు వేరు కాదు. వేరు వేరు రూప నామములుగా మనకు గోచరిస్తుందేగాని మూడూ చేరి ఒకటే. (చేతి రుమాలను చూపిస్తూ) ఇది ఏమిటి? ఇది వస్త్రం. ఎట్లా అయింది? ప్రత్తి, దారముగా తయారైంది. దారము వస్త్రముగా రూపొందింది. ప్రత్తి లేక దారములేదు, దారము లేక వస్త్రమూ లేదు. రూపనామములు వేరు. మన త్రిగుణముల తత్వము ఏకత్వమైన సత్య తత్వముతో కూడి ఉంటున్నది.

విద్యార్థులారా! ఏ సాధనలు చేయకపోయి నప్పటికిని భగవత్ ప్రేమను పెంచుకోవాలి. నిర్మల నిశ్చలమైన ప్రేమను పెంచుకుంటే మనకు సర్వమూ లభ్యమైపోతుంది. హనుమతుండు శ్రీరామునికి ప్రియమైన, ముఖ్యమైనవాడుగా వున్నాడంటే దీనికి కారణమేమిటి? పరమ భక్తియే పవిత్రమైన శక్తిని అందిస్తుంది. ఎన్ని కష్టములకైనా ఎన్ని బాధలకైనా సహించి రామాజ్ఞను శిరసావహించటమే ప్రధాన కర్తవ్యమని విశ్వసించాడు హనుమంతుడు. ఆజ్ఞ ఇచ్చిన భగవంతుడే శక్తిని కూడా ప్రసాదిస్తాడనే విశ్వాసంతో సీతాన్వేషణకు పూనుకున్నాడు. లంకలో ప్రవేశించాడు. విభీషణునితో స్నేహం చేసుకున్నాడు. సీతను చూచాడు. అడ్డం వచ్చిన రాక్షసమూకలను చీల్చి చెండాడు. శ్రీరామునికి సీత ఉదంతం వివరించాడు. శ్రీరామునికి ప్రియాతిప్రియుడైనాడు. భగవత్ ప్రేమకు పాత్రుడైనాడు. భగవత్ ప్రేమ సంపూర్ణమైన హృదయముతో వుండినా సర్వమూ మనకు లభ్యమైపోతుంది. భగవత్ ప్రేమను మనము అనుభవించుటచే త్రిగుణముల స్వాధీనము జరుగుతుంది. త్రిగుణాలను సాధించిన వ్యక్తి త్రిలోకములను సాధించగలడు. బయట రాజ్యమును జయించినవాడు రాజు కావచ్చు. ఇంద్రియాలను జయించినవాడు రాజాధిరాజ రాజ మహరాజు (చక్రవర్తి) కాగలడు. హృదయ సామ్రాజ్యమునకు చక్రవర్తి అవుతాడు. కనుక విద్యార్థులు ఆదర్శవంతమైన జీవితాన్ని అందించాలి. మీ హృదయాలను విశాలము గావించుకోండి! ప్రేమభావమును అభివృద్ధిపరచుకొని సమాజములో ప్రవేశించండి. మీవెంట జంట కంట వుంటుంది సర్వవిధముల విజయము సాధించటానికి భగవంతుడు తగిన శక్తినందిస్తాడు. అట్టి విశ్వాసమును మీరు మొట్టమొదట బలపరచుకోవాలి. స్వార్థమును త్యాగం చేయండి. పరమార్థమును ప్రేమించండి. దైవప్రీతి, పాపభీతి, సంఘనీతి – ఈ మూడింటిని మీరు అభివృద్ధి పరచాలి.

( బెంగుళూరులో జరిగిన శిక్షణా తరగతులలో ది 28-5-1990 భగవాన్ బాబావారు చేసిన దివ్య ప్రసంగము నుండి )

( 4 వ పేజీ తరువాయి )

ప్రబోధించే మతసామరస్యానికి మచ్చుతునక. ఈమధ్య కాలంలో శ్రీ పబ్బతి సత్యంగారింట్లో అనేక రకాల అత్యద్భుతాలను స్వామి ప్రదర్శించారు. చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు తండోపతండాలుగా వచ్చి స్వామి ప్రదర్శించిన దివ్య లీలను తిలకించి ఆశ్చర్యచకితులైన వారెందరో...నాస్తికులు, హేతువాదులు కూడా పరిశీలించి స్వామి అద్భుతశక్తికి తలలొంచారు. స్వామి సర్వాంతర్యామి, మహిమాన్విత శక్తిసంపన్నులేనని అంగీకరించక వారికి తప్పలేదు. రామశేషు దంపతులకు మంగళసూత్రాలు శ్రీవాణి ద్వారా భగవాన్ బాబావారు ప్రసాదించటం శ్రీవాణికి కూడా ఒక అదృష్టమే. ది 7-11-1987 న శ్రీవాణి ప్రత్యేక సంచిక (స్వామి జన్మదినోత్సవ సందర్భమున ముద్రించిన) స్వామికి సమర్పించి వారి దివ్యసందేశమును అర్థించగా "శ్రీవాణి నా వాణే గదా! ఇంకా మరో సందేశం దేనికి?" అనిన స్వామి మాటలు ఈనాడు నాకు గుర్తుకు వచ్చి నేను పొందిన ఆనందానికి అవధులే లేకుండా పోయింది. శ్రీవాణిని ఇంతకాలంగా నడుపగలుగుతున్నానంటే స్వామి ఆశీస్సులు, అనుగ్రహ ప్రభావమే తప్ప వేరొకటి కాదు. రామశేషు దంపతులు పొందిన ఆనందంలో కొంత భాగాన్ని స్వామి ఈ విధంగా నాకు ప్రసాదించారేమో!...స్వామి లీలలు సామాన్యులమైన మనకు అర్థంకావు గదా!... స్వామి ఎవరిని, ఎప్పుడు ఏవిధంగా అనుగ్రహిస్తారో! వారి దివ్యాశీస్సులను అందిస్తారో! చెప్పటం కష్టం.

* * *

స్వామి అవతార ప్రకటన స్వర్ణోత్సవ మహోత్సవములకు ప్రపంచం నలుమూలల నుండి 20 లక్షల మంది భక్తులు వస్తారని నిర్వాహకుల అంచనా. యావన్మంది భోజన వసతి సౌకర్యములు వారంరోజుల పాటు ఉచితంగా ఏర్పాటుచేస్తున్నారు. ఇది మానవమాత్రులకు సాధ్యమయ్యే విషయంకాదు. నవంబర్ 21వ తేదీన భారత రాష్ట్రపతి బీడుపల్లి గ్రామం వద్ద (ప్రశాంతినిలయంకు 5 కిలోమీటర్లు) బ్రహ్మాండమైన ఆసుపత్రి సముదాయానికి శంకుస్థాపన చేస్తారు. భారత దేశంలో ఇటువంటి వైద్య సౌకర్యముగల హాస్పిటల్ వేరొకటి ఉండకపోవచ్చునని భావిస్తున్నారు. మెదడు గుండె, కాలేయములకు సంబంధించిన చికిత్సలు యిక్కడ ఉచితంగా లభిస్తాయట. నవంబర్ 22న జరుగు శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయ ఎనిమిదవ స్నాతకోత్సవంలో గౌ॥ రాష్ట్రపతి ముఖ్య అతిధిగా పాల్గొంటారు నవంబరు 23న భగవాన్ బాబావారి 65వ జన్మదినోత్సవ వేడుకలు కడు వైభవంగా జరుగుతాయి. కొండమీద రెండు అంతస్తుల మ్యూజియం రూపురేఖలను దిద్దుకుంటున్నది. అది ప్రపంచ సాంస్కృతిక, ఆధ్యాత్మిక విలువలకు ప్రతీకగా నిర్మించబడుతున్నది. బ్రాహ్మణపల్లి సమీపంలో వాయుదూత్ విమానములు దిగటానికి వీలుగా విమానాశ్రయము కూడా నిర్మించబడుతున్నది. కొండమీద 65 అడుగుల ఆంజనేయస్వామి విగ్రహం చూడముచ్చటగా నిర్మించబడుతున్నది. లక్షలాదిమంది కూర్చొని ఉపన్యాసాలు వినటానికి వీలుగా Open Air Stadium ను విస్తృత పరుస్తున్నారు. అందులోనున్న 'శాంతి వేదిక'ను విశాలంచేసి అతి సుందరంగా తీర్చిదిద్దుతున్నారు. నూతనంగా మూడంతస్తుల సుందర భవనాలు ప్రపంచ ప్రముఖుల వసతికోసం ప్రత్యేకంగా నిర్మించబడుతున్నాయి లక్షలాది భక్తుల వసతికోసం వందల ఎకరాలు బుల్‌డోజర్ల ద్వారా చదును చేయబడుతున్నది. షామియానాలు, టెంట్లు వుండటానికి వేస్తారుట. దాదాపు 90 దేశాలనుండి ప్రతినిధులు ఈ మహోత్సవాలలో పాల్గొంటారని నిర్వాహకులు చెబుతున్నారు. అలనాడు రామావతార కాలంలో అయోధ్య, కృష్ణావతారంలో ద్వారక మహానగరాలు విలసిల్లినట్లుగా, ప్రస్తుత ఈ అవతార (శ్రీ సత్యసాయిబాబా) కాలంలో ప్రశాంతి నిలయం కూడా అంతటి విశిష్టతను, శోభను సంతరించుకుంటుందనటంలో ఏమాత్రం అతిశయోక్తిలేదేమో! ఎక్కడో మారుమూలనున్న పుట్టపర్తి గ్రామమునకు ఇంతటి ప్రపంచ ప్రాముఖ్యత రావటం కేవలం భగవాన్ బాబావారి దివ్యలీలల ప్రభావమే తప్ప వేరొకటి కాదు. అట్టి దైవాంశసంభూతుని సమకాలీనులుగా వుండే మహద్భాగ్యం కలగటం నిజంగా మన పూర్వజన్మ సుకృతమే.

— కొమరగిరి

( 12వ పేజీ తరువాయి )

అతిసన్నిహితుడు బాబాకు. అలాంటి సన్నిహితుడైన వ్యక్తిని పంపించటంచేత బాబా ఆనందంగా లేడని భక్తులు ఒకరికొకరు చెప్పుకుంటూ వచ్చారు.

అదే సమయంలో "శ్యామ్" తల్లిదండ్రులు రిటైర్ అయినతరువాత 2 సం. పిల్లవాడ్ని (శ్యామ్)ని తీసుకొని షిరిడీ వచ్చారు. అతని పేరు "మోహన్ శ్యామ్". తల్లిదండ్రులు "మోహన్" అని పిలిచేవారు. బాబా మాత్రం "శ్యామ్" అని పిలిచేవారు. వారు షిరిడీలోనే నివాసమేర్పర్చుకున్నారు. "శ్యామ్" అక్కడనే స్కూలులో చేరాడు. సాతే పోయినతరువాత "శ్యామ్"ను దగ్గరకు తీసాడు బాబా. శ్యామ్ టీచర్ ట్రయినింగ్‌లో ప్యాసయి అక్కడే ఒక స్కూలులో టీచర్‌గా నియమింపబడ్డాడు. పగలంతా పిల్లలకు చదువు చెప్పి, రాత్రిపూట అదే క్లాస్‌రూంలో పడుకొనేవాడు శ్యామ్. దానిప్రక్క గదిలోనే బాబా ఉండేవారు.ఈరెండు గదులకు మధ్యనున్న వెంటిలేటర్ ద్వారా బాబాను రాత్రింతా చూస్తుండేవాడు. బాబా తనలో తాను మాట్లాడుకోవటం, తనలో తాను నవ్వుకోవటం,తనలో తాను కోప్పడటం చూస్తూవచ్చాడు శ్యామ్. బాబా పడుకునే ఉయ్యాలబల్ల ఒకటిన్నర అడుగుల చెక్క. ఆ చెక్కపైనే పడుకొని ఊగుతుండేవాడు. నిద్రలోపల ఎక్కడ స్వామి క్రిందపడిపోతాడేమోనని శ్యామ్ భయం. ఒకనాడు బాబా పాదాలు వత్తుతూ ధైర్యంచేసి "స్వామీ! రాత్రింతా మీరు నిద్రపోవటంలేదే? ఏదో నవ్వుతుంటారు, మాట్లాడుతుంటారు. ఏమిటి దీని అంతరార్థం? తెలియచెప్పండి" అని ప్రార్థిస్తాడు. "పిచ్చివాడా! నీవొక్కడవే అనుకుంటున్నావా? ఈ లోకంలో ఎంతోమంది నా కోసం ప్రార్థిస్తుండేవారున్నారు. వారందరితోను మాట్లాడుతుంటాను. నా వేళ్ళు త్రిప్పటం నా Plan. అనగా వాళ్ళ మనస్సు త్రిప్పటమే. వాళ్ళతో మాట్లాడటమే నా పెదవులు చేసే పని. వాళ్ళ పిచ్చితనాన్ని చూచి నవ్వటమే నాయొక్క సరదా" అని సమాధానం చెబుతారు బాబా. బాబాని ప్రార్థించి తన తీరిక సమయాలలో స్వామి సేవలో మునిగిపోయేవాడు శ్యామ్.

బాబా కోపం తీవ్రంగా ప్రదర్శించేటటువంటివాడు. కోపం వస్తే పది అడుగుల దూరంలో వున్నా కర్రను వానిపై విసిరేవాడు. ఒకరోజున శ్యాం ప్రశ్నించాడు "స్వామీ! ఇంత కోపంతో వారిని కొడుతున్నావే! వారికేమైనా ప్రమాదం వచ్చి ప్రాణం పోతే మీపైన చాలా అపకీర్తి వస్తుంది కదా!" అన్నాడు. "ఏ సైతాన్ బైఠో! ఆ ప్రాణం నా చేతిలో ఉంది. నేను పంపిస్తే కదా! వాడి ప్రాణం పోయేది! నేను పోకుండా చూచుకుంటాను. పో! ఏ పని నీవు చూసుకో!" అన్నాడు బాబా. "నీకెందుకు దీని విషయంలో యింత విచారం? ఈ రకమైనటువంటి దృశ్యమును వాడికి చూపినప్పుడే వాడు సరియైన స్థితికి వస్తాడు. మంచిగా...మంచిగా పోతే నా తలపై కూర్చుంటాడు. కార్యనిమిత్తమై నేను ఇంత చర్య చేస్తున్నానుకాని, నాలో కోపం లేదు" అని ఒక్క శ్యామ్‌కు మాత్రమే లోపల మున్న రహస్యాన్ని చెప్పాడు బాబా. కనుక బాబా చర్యలు కేవలం ప్రేమ తత్వం తప్ప అన్యము కాదు.

1917 సం.లో దాదా, నానా, దాస్‌గన్, చంద్రార్కర్ మానస్‌పతిలను పిలిచాడు. ఏయ్! దాస్‌గన్! నేనెవరో తెలుసా? అసలు నీవెవరివో తెలుసా? నేను తమ శిష్యుడను అన్నాడు. నానా నీవెరివో తెలుసా? తమ శిష్యుడను స్వామీ అన్నాడు. ఈవిధంగా అందరూ తమ శిష్యులమే నన్నారు. ఛీ! ఛీ! ఈ పదము మీరు ఉపయోగించకండి. నాకు శిష్యులెవ్వరూ ఈ జగత్తులో లేరు. భక్తులు కోట్లమంది ఉంటున్నారు. భక్తులకు, శిష్యులకు ఉండినటువంటి తేడాను మీరు గుర్తించటం లేదు. ఎవరయినా భక్తులు కావచ్చు. శిష్యులు మాత్రం అవలేరన్నాడు. భగవంతుని ఆజ్ఞ తప్ప నాకు అన్యము లేదనేవాడు శిష్యుడు. నాయొక్క నీడవలె నన్ను వెంటాడేవాడు నా శిష్యుడు. కాబట్టి మీరు శిష్యులని చెప్పటానికి మీకెక్కడుంది అధికారం? భగవంతుని ప్రార్థించేవాడు భక్తుడు. కనుక భక్తునకు, శిష్యునకు చాలా తేడా ఉంది. శిష్యుడనగా కేవలం రెండు దేహములు ఒక ప్రాణం. నీవు వేరు, నేను వేరు అన్న భావం ఉండకూడదు. I and you are one. ఇది

ఒక్కటిగా రావాలి. కాని అలాంటివారు ఈ జగత్తులో కనిపించటంలేదు. అప్పుడు 'శ్యామ్' చాలా బాధపడ్డాడు. నీ పదసేవ తప్ప నాకు అన్యములేదు గదా! స్వామీ! అన్నాడు శ్యామ్. తరువాత లేచి లోపలకు వెళ్ళాడు బాబా. శ్యామ్‌ని ప్రత్యేకంగా లోపలికి పిలిచాడు. "నాకు ఈ జగత్తులో నీవు ఒక్కడివే శిష్యుడవు, అందరూ భక్తులే" అన్నాడు బాబా. బాబా పలుకులను వినిన శ్యామ్ ఆనందభరితుడై, తన్మయత్వంతో బాబా పాదాలను పట్టుకొని నీవే తప్ప, నీవే తప్ప అంటూ ప్రాణాలను వదిలాడు. బాబా తన 82 సం.ల జీవితంలో ప్రజలు చూడగ ఒక్క చుక్క కన్నీరు విడచినవాడు కాదు. శ్యామ్ పోయినప్పుడు మాత్రం మూడు కన్నీటిబొట్లను విడిచాడు బాబా. అది చూచిన భక్తులు "స్వామీ! సర్వమూ మీ చేతిలో ఉంది కదా! మీరెందుకు విచారిస్తున్నారు" అంటారు. "పిచ్చివాడా! నేను దుఃఖించటం లేదు. అతను చేసిన పాపములన్నీ పరిహారమైనాయి. ఏదో ఇంకాకొంచెం ఉండటంచేత, ఈమూడు కన్నీటి చుక్కలతో దానినికూడా తుడిచివేస్తున్నాను" అన్నాడు బాబా. బాబా చేసే ప్రతి పని, ప్రతి మాట, ప్రతి చేష్ట-అన్నీ భక్తులను ఉద్ధరించే నిమిత్తం తప్ప అన్యము కాదు.

కొన్ని దినములు గడచిన తరువాత 'ప్రధాన్'ను పిలిచాడు బాబా. ఫలానా స్థానములో ఒక చిన్న తొట్టిని కట్టమని చెప్పాడు. 1918 సం. వచ్చింది. ప్రధాన్ భార్య తన గ్రామంలో నివసిస్తున్నది. ఆమె కలలో బాబా మరణించినట్లు కనిపించింది. వెంటనే లేచి తన బిడ్డలతో అయ్యో! బాబా మరణించినట్లు నాకు కల వచ్చిందని ఏడుస్తూ కూర్చుంది. తక్షణమే తన ఇంటి నుండి ఒక శబ్దం వచ్చింది. బాబా మరణించడం అనే టటువంటి పదం ఉపయోగించవద్దు. బాబా సమాధిలో ఉంటున్నాడనే పదాన్ని ఉపయోగించవలెను, అని వినవచ్చింది 'సమాధి అనగా సమచిత్తంతో కూడినటువంటివాడు.' జనన మరణములు, సుఖదుఃఖములు, లాభనష్టములు రెండూ సమానమే. కనుక బాబాకు మరణమనేటటువంటిదిలేదు అని శబ్దమొచ్చింది. ఎక్కడిదీ శబ్దము, ఎక్కడిదీ శబ్దము? అని వెతుకుతుండగనే భర్త ఒక కవరు పంపించాడు, బాబా దేహాన్ని వదిలాడని. అది రేపటిదినం విజయదశమి. సెప్టెంబరు 28, 1335 సం. పుట్టినదినము. 1918 సం.లోని విజయదశమి దేహాన్ని వదిలిన దినము.

కట్టకడపటి సమయంలో అబ్దుల్లా కూడను దరికి చేరాడు. తిరిగి నేను వస్తాను, దర్శనమిస్తానన్నాడు. అది ఎప్పుడు స్వామీ! అని అడుగగా ఎనిమిదేళ్ళ తరువాత నన్నాడు. మొదటి అవతారము మహారాష్ట్రము, రెండవది మద్రాసు రాష్ట్రము (ఆనాడు ఆంధ్ర, మద్రాసు రాష్ట్రంలో వుండేది) అన్నాడు. అప్పుడు మాకు ఏ విధముగా దర్శనమిస్తారు? అని అడిగాడు అబ్దుల్. అప్పుడు అబ్దుల్ బాబాకు చెప్పి ఉన్నాడు, సత్య పాలనతో, సత్యపేరుతో నీకు లభ్యమవుతుందన్నాడు. అదే ఇప్పుడు రావటం దేహములు రెండు కాని దివ్యత్వం ఒక్కటే. అయితే ఒక్కటి మాత్రం దివ్యత్వాన్ని తెలుపుటకోసం(షిరిడీ అవతారం) ఇక్కడ దివ్యత్వాన్ని అందించుటకోసం (ప్రస్తుత సత్యసాయి అవతారం), రాబోయేది దివ్యత్వాన్ని బోధించుటకోసము (ప్రేమ సాయి). అదే షిరిడీసాయి, సత్యసాయి, ప్రేమసాయి.

దేహములు నీటిబుడగలవంటివి. దేహాలు ధరించేది భక్తోద్ధరణ కోసమే. సాకారమే లేక నిరాకారాన్ని ఎవ్వరూ విశ్వసించలేరు. సాకారమే నిరాకారమునకు పునాది. సగుణ నిర్గుణములతో ఉంటుంటాడు. అణువు ఘనముగా ఉంటుంటాడు. ఏది అణువో, ఏది ఘనమో ఎవ్వరూ గుర్తించలేరు. ఏది సగుణమో, ఏది నిర్గుణమో ఎవరూ భావించలేరు. కనుక భగవంతుని తత్త్వమును ఎవరూ అర్థం చేసుకొనలేరు. అర్థం చేసుకోవడానికి వీలు లేకపోయినప్పుడు ఊరుకుండుట మంచిదికాని, అనర్థాలలోకి ప్రవేశించకండి. ఆరాధనల చేతనూ,భజనలచేతనూ భగవంతునియొక్క దివ్యత్వాన్ని గుర్తించటానికి ప్రయత్నించండి!

(ది 28-9-1990 న భగవాన్ బాబావారు తమ దివ్యావతార రహస్యములను వివరిస్తూ చేసిన దివ్య ప్రసంగము నుండి)

○

## దీపావళి

( 3వ పేజీ తరువాయి )

భావమయిన అజ్ఞానాన్ని పోగొట్టి, దీపగుళికలు లాంటి సద్భావములచేత, ఆత్మజ్యోతిని వెలిగించి ఆత్మజ్ఞానాన్ని పొందాలని అసలు అర్థం.

ఇది కాక దీపావళి రోజున ధనలక్ష్మీ పూజ చేయటం కూడా మన ఆచారం. కొన్ని ప్రాంతాలలో ఇది చాలా పెద్ద ఉత్సవంగా జరుపుతారు. కేరళ రాష్ట్రమందు దీపావళికి మరో కథ వున్నది. విష్ణుమూర్తి వామనావతారంలో బలిచక్రవర్తిని మూడడుగుల దానంకోరగా, ఒకటి భూమిపైన, రెండు ఆకాశంలో, మూడవ అడుగు బలియొక్క తలపైన ఉంచి బలిని పాతాళానికి పంపించాడు. అయితే ఏడాదికొకమారు తాను బహుకాల మేలిన భూలోకమునకు రావచ్చునియూ, ఆనాడు ప్రజలందరూ ఆయనను దీపములతో స్వాగతం చెప్పుదురనియూ, విష్ణుమూర్తి వరమిచ్చెనని, ఆ రోజే దీపావళి యని వారి నమ్మకం.

శ్రీరామచంద్రుడు, రావణాసురుని హతమార్చి వనవాసము ముగించుకొని, అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడై యుండగా రామరాజ్యములోని ప్రజలంతా ఆనందముగా దీపమాలలు పెట్టినరోజు దీపావళి యని ఉత్తర భారతీయులు నమ్ముతారు. మొత్తముమీద, ఏ రాష్ట్రమువారైనా, ఏ భాషవారైనా ఈ దీపావళిని అత్యంత వైభవముగా జరుపుకుంటారు.

ఈనాడు ప్రతి మానవుడు అజ్ఞానంలో మునుగుతూ అహంకారంతో విఱ్ఱవీగుతూ మనయొక్క సంస్కృతి, సంప్రదాయములను పండుగలు పర్వదినాలను వాటిలోని అంతరార్థాలను మరిచిపోతున్నాడు. లేచింది మొదలు స్వార్థచింతనే తప్ప పరార్థచింతన, పరమాత్మచింతన లేదు. అందువలననే మనలో అసురగుణాలు పెరిగి నరకాసురులు, రావణాసురులు, దుశ్శాసనులు, కీచకులు వందలు, వేలకొలది పుట్టుకొస్తున్నారు. శాంతి కరువైంది. అశాంతి పెరిగింది.

మన పూర్వీకులు ప్రతి నెలలోను ఒక పండుగ పేరు చెప్పి అందుకు ఉదాహరణగా ఒక కథ చెప్పి వాటిలోని మంచి, చెడులను వాటికి నివారణోపాయాన్ని మనకు సులభంగా అర్థమయ్యే రీతిలో చెప్పారు. వాటిని అర్థంచేసుకొనే తీరిక, ఓపిక మనకిప్పుడు లేవు. అందువల్ల మనలో అమరభావాలు పోయి, అసుర భావాలు వృద్ధిచెందుతున్నాయి. కనుక మనం ఉన్నత భావాలు పెంపొందించుకోవటానికి ప్రయత్నించాలి. ◯

## లజపతిరాయ్

( 8 వ పేజీ తరువాయి )

కీలుబొమ్మలం కారాదు. మనకు గర్వించదగ్గ చరిత్ర వున్నది. కాని మనం క్రమశిక్షణతో గనుక మెలగక పోతే మనకి ప్రగతి లేదు " అని తెలియజేశారు ఇది లాలాజీ దేశభక్తి, విశాల జాతీయ దృక్పథానికి, సమరస భావానికి దర్పణం అని చెప్పవచ్చును.

భారతదేశంలో సోషలిష్టు భావాలకు విత్తనం వేసిన వాడు లాలాజీ. అయితే కారల్ మార్క్స్ ప్రతిపాదించిన వర్గ సంఘర్షణ సిద్ధాంతాన్ని మాత్రం ఈయన అంగీకరించలేదు. విప్లవంద్వారా కాక ప్రజాస్వామ్య పద్ధతుల ద్వారా మాత్రమే ప్రజలందరికి సమాన అవకాశములు గల వర్గరహిత సమాజాన్ని నిర్మించగలమని లాలాజీ అభిప్రాయపడ్డారు. ఈ వాస్తవాన్ని ఈనాడు కమ్యూనిష్టు రాజ్యాలు గుర్తించి తమ విధానములను మార్చుకొని ప్రజాస్వామ్య పంథాను అనుసరిస్తున్నాయి. ఇది లాలాజీ దూరదృష్టికి, రాజకీయ పరిజ్ఞానానికి, ఆర్థిక విశ్లేషనానికి నిదర్శనం.

1920 సంవత్సరంలో బొంబాయిలో జరిగిన ప్రథమ భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకు అధ్యక్షత వహించారు. 1921 సం॥లో జెనీవాలో జరిగిన అంతర్జాతీయ కార్మిక సభకు భారత ప్రతినిధిగా హాజరైనారు. పంజాబ్ నేషనల్ బ్యాంకు, లక్ష్మీ ఇన్సూరెన్సు కంపెనీలను స్థాపించి కార్మిక, కర్షక అభ్యుదయానికి పాటుపడ్డారు.

ఉన్నత రాజకీయ భావాలు, మతసామరస్యం, అత్యున్నత జాతీయ దృక్పథం, సంఘసేవా పరాయణత్వం, సత్శీలం మొదలగు ఆదర్శ భావములు గల లాలాజీ జీవితం నేటి నీతిమాలిన గతితప్పిన కుల మత ప్రాంతీయ సంకుచిత ధోరణులకు చెలియలకట్ట కాగలదని ఆశిద్దాం.

❋ ❋ ❋

# విశాల విశ్వం ఒక వసుధైక కుటుంబం

## స్పందిస్తూ సానుభూతితో అందిస్తోంది సహాయం

" ఆంధ్రప్రదేశ్‌లో సంభవించిన పెనుతుఫాన్ భీభత్సానికి ఇంటా, బయటా మానవాళి వేదనతో స్పందించింది. పునరావాస కార్యక్రమాలలో వారు భాగస్వాములై, తగు సహాయ, సహకారాలు అందించడం చెప్పుకోదగిన విషయం. * విపత్కర సమయాలలో మానవకోటి పరస్పరం సహాయ సహకారాలు అందించుకునే ప్రయత్నం ... ఎలాంటి హద్దులు, అడ్డంకులు వారిని విడదీయలేవు. * గతంలో ఇలాంటి విపత్కర సంఘటనలను ఎన్నిం... సమర్థతతో అంకితభావంతో చాకచాక్యంగా ఎదుర్కొన్న జాతి మరొకసారి ఆర్థిక స్థితిని ఛిన్నాభిన్నం చే... దుర్ఘటనను ఎదుర్కొనవలసిన తరుణం ఏర్పడింది. * ఈ సమస్యను ధైర్యంతో సమర్థవంతంగా ఎదుర్... గలగడం మనకు ఎంతో బలాన్ని విశ్వాసాన్ని యిస్తోంది. అందరం కలిసి ఉజ్వల భవితవ్యాన్ని నిర్మించుకుందాం.

డా॥ మర్రి చెన్నారెడ్డి, ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్

సరియైన సమయంలో అంకిత భావంతో అందించిన సాటిలేని సహాయక చర్యలు :

* ముఖ్యమంత్రి డా॥ మర్రి చెన్నారెడ్డి పట్టుదల, చొరవవల్ల తుఫాన్ బాధిత ప్రాంతాలలో శాశ్వత ప్రాతిపదికపై పునరావాస కార్యక్రమాలు చేపట్టడానికి ప్రపంచ బ్యాంకు నుండి రాష్ట్రం కోరిన రు. 2,800 కోట్ల ఆర్థిక సహాయం లభించే అవకాశం సుగమమయ్యింది. తుఫాను బాధితులు నూతన జీవితాన్ని ఆరంభించేందుకై రు. 120 కోట్లకు పైగా ఖర్చు చేయడం జరిగింది.

మారుమూల ప్రాంతాల అభివృద్ధి ప్రణాళిక చురుకుగా అమలు :

* ముఖ్యమంత్రి డా॥ మర్రి చెన్నారెడ్డి మే 1 వ తేదీన ప్రారంభించిన మారుమూల ప్రాంతాల అభివృద్ధి కార్యాచరణ ప్రణాళిక ఎంతో వేగంగా అమలు జరుగుతున్నది. 9 జిల్లాల్లో 2,370 పనులు 1.50 లక్షల రు॥లతో చేపట్టారు. * అన్నింటికన్నా ఆదిలాబాద్ జిల్లా ఎక్కువ మొత్తం 59 లక్షల రు॥ల ఖర్చుతోను, వరంగల్ జిల్లా పెద్ద సంఖ్యలో 583 పనులు చేపట్టినట్లు సీనియర్ అధికారులు తెలిపారు. * 87.9 లక్షల రు॥లు త్రాగునీటి సరఫరాకు కేటాయించారు. * సంచార వైద్యబృందాలు 600 గ్రామాలు పర్యటించి 74,000 మంది రోగులను పరీక్షించారు. * 140 పశు వైద్య బృందాలు 700 గ్రామాలలో సంచరించి 1.68 లక్షల పశువులను పరీక్షించారు. * షె॥ కులాలు మరియు షె॥ తెగలకు చెందిన 1,000 సాగునీటి బావులకు విద్యుత్ సరఫరా చేయడం. వెనకబడిన తరగతులు నివసించే 20 ప్రాంతాల విద్యుద్దీకరణ ఉన్నాయి.

అహింస మన ఆయుధం, శాంతి మన సందేశం. మన విధానం స్పష్టమే, మార్పు లేదు.

* రాష్ట్రంలో దృఢ నిశ్చయంతో శాంతి భద్రతలను పరిరక్షిస్తూ వారి సమస్యలకు చట్టం, ప్రజాస్వామ్యం పరిధిలోనే శాశ్వత పరిష్కారం కోసం వారిని చర్చలకు ప్రభుత్వం ఆహ్వానించింది. * తీవ్రవాద కార్యకలాపాలు సాగిస్తున్న ప్రాంతాలలో అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టేందుకు అధిక ప్రాధాన్యత ఇవ్వబడుతుంది.

సబ్సిడీ బియ్యం అందవలసింది ఎవరికి ? మీరే నిర్ణయించండి !

* ఆకుపచ్చ కార్డులున్నవారి హక్కులకు ఎటువంటి భంగం కలగకుండా తమ హక్కులు తాము పొందేలా చేయడానికి అన్ని చర్యలు తీసుకోవడం జరుగుతుంది. * ఈ బోగస్ కార్డుల ఏరివేతలో అసలైన ఆకుపచ్చ కార్డు కలిగిన యజమాని కార్డును పొరపాటుగా తీసివేస్తే దీనిగురించి ప్రభుత్వానికి తెలియపరిచే అవకాశం ఉంది.

మనది ప్రజాప్రభుత్వం - ప్రజా సంక్షేమమే మన ధ్యేయం

30/Advt/APRO/90-91